 42

ప్రథమ ముద్రణ : నవంబరు, 2005





వెల : రూ. 30/-




ప్రతులకు:
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్ / సుల్తాన్‌బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం, కాకినాడ,
గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి.

మరియు
డా|| ద్వా.నా.శాస్త్రి
1-1-428, గాంధీనగర్,
హైదరాబాద్ - 500080.
ఫోన్ : 040 - 27621590
సెల్ : 9849293376

ముద్రణ : శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-500 029

# నామాట

ఆచార్య దొణప్పగారు గురువులకు గురువు. శిష్యుల అభ్యుదయమే వారి తపన. వారి పాఠం అత్యంత ఆసక్తికరంగా విజ్ఞానదాయకంగా ఉండేది. వారి క్రమశిక్షణ, సమయపాలన ఆదర్శవంతం.

ఇటువంటి దేశికోత్తముని శిష్యుడవటం నా అదృష్టం. నన్ను సాహిత్య రచనవైపు – విమర్శ వైపు నడిపించిన శక్తులలో మొదటి వారు దొణప్పగారు. రెండవ వారు చేరా గారు. మా "స్టార్" గారు చెప్పినట్టు గురు ఋణం కొంత తీర్చుకోవాలని ఉండేది. ఆ సదవకాశం ఇప్పుడు వచ్చింది. ఈ సంగ్రహ చరిత్ర (మోనోగ్రాఫ్) రాయాలన్నప్పుడు విశాలాంధ్ర మేనేజర్ పి. రాజేశ్వరరావుగారు, గురుపత్ని శ్రీమతి గోవిందమ్మగారు, గురుపుత్రులు సుధాకర్‌గారు నాకు సహకరించారు. చేరా, బేరాలు ఆమోదం తెలిపారు. ఆచార్య సిమ్మన్న తెగమెచ్చుకొన్నారు. అందరికీ కృతజ్ఞతలు.

– ద్వా.నా.శాస్త్రి

# ఇందులో....





# మిత్ర వాక్యం

ఆచార్య వెలమల సిమ్మన్న,
తెలుగుశాఖ, దూర విద్యాకేంద్రం,
ఆంధ్ర విశ్వకళాపరిషత్,
విశాఖపట్నం - 530 003.

1-11-2005,
ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం.

దొణప్ప అంటే పరిశోధన. పరిశోధన అంటే దొణప్ప. ఉత్తమ అధ్యాపకులుగా ఆదర్శ పరిశోధకులుగా, నిత్య విద్యార్థిగా, సత్యతత్త్వాన్వేషిగా, సుప్రసిద్ధ భాషావేత్తగా ఎందరో శిష్యుల్ని తయారు చేసిన ఉత్తమోత్తమ గురువుగా, బహుభాషా కోవిదులుగా, పరిపాలనా దక్షులుగా, పట్టువీడని కార్యదీక్షాపరులుగా, పండితుడుగా, ప్రామాణిక రచయితగా, జానపద సాహిత్య సంగ్రాహకుడుగా దొణప్పగారు తెలుగు భాషాభివృద్ధికి గణనీయమైన కృషి చేశారు. అధ్యయనమే తపస్సుగా అధ్యాపనమే ఆత్మానందంగా, నిరంతర పరిశోధనమే ధ్యేయంగా, పరిశోధన పర్యవేక్షణమే లక్ష్యంగా కలిగిన బహుముఖ ప్రజ్ఞాశీలురు దొణప్పగారు.

దొణప్పగారి శిష్య సంపద ఎక్కువ. ఎంతోమంది వారివల్ల అధ్యాపకులు, రీడర్లు, ప్రొఫెసర్లూ, ప్రిన్సిపాల్సు.... వంటి పదవులెన్నెనో అధిష్ఠించారు. మరెంతోమంది కవులు, విమర్శకులు, రచయితలు, భాషా శాస్త్రవేత్తలుగా ప్రసిద్ధులయ్యారు. అయితే ఏరు దాటాక తెప్ప తగలేసేవారూ వుంటారు. ద్వా.నా.శాస్త్రిగారు అలా కాకుండా దొణప్పగారి వల్ల పదవులేమీ పొందకపోయినా వారిచ్చిన స్ఫూర్తి, ప్రోత్సాహంవల్ల, వారిని ఆదర్శంగా తీసుకొని సాహిత్యరంగంలో రారాజుగా నిలిచి - గురువుగారిని మర్చిపోకపోవటం అపూర్వమైన విషయం. లోగడ "తెలుగు సాహిత్య చరిత్ర" వంటి గొప్ప పుస్తకాన్ని దొణప్పగార్కి అంకితమిచ్చిన గురుభక్తి తత్పరులు ద్వా.నా.శాస్త్రిగారు. ఇప్పుడు ఈ మోనోగ్రాఫ్‌ను రాసి ప్రచురించటం అభినందనీయం. హర్షణీయం. సాహిత్య రంగంలో బోధనారంగంలో గురువుగారి అడుగు జాడలలో నడుస్తున్న - సవ్యసాచి ద్వా.నా.శాస్త్రి గారి వంటి శిష్యులుండటం ఏ గురువుకైనా గర్వకారణమే. ఈ పుస్తకానికి స్వాగతం చెప్తూ-

- వెలమల సిమ్మన్న.



# సినారె ఉవాచ.....

"మేధాకషమైన వ్యాకరణ వైదుష్యంతోపాటు మెత్తనిజాను తెనుగు పలుకుబళ్ల మేలిమిని ఆకళించుకున్న రసస్నిగ్ధమతులు మిత్రులు దొణప్పగారు. ఒకపలుకులో ముట్టాలన్నా, ఒక చెణుకు సిగలో ఔచితీ పారిజాతాలు చుట్టాలన్నా- ఆ ఒడుపు బాగా ఎరిగిన ఒజ్జ దొణప్ప: సుధాచిక్కణ వచనరచనలో దొణప్పగారిది సురుచిరశైలి. ఆయన వాక్య నిర్మితి ఒక్కోసారి కోహినూరు వజ్రకుడ్య పంక్తిలా ప్రభాసిస్తుంటుంది. పరిశోధన క్షేత్రంలో ఆయన మూడు దశాబ్దాలుగా చేస్తున్న నిరవద్యమైన సేద్యానికి ఆయన రచించిన మౌలిక భావతుందిల గ్రంథాలతోపాటు పర్యవేక్షించిన, పరీక్షించిన సిద్ధాంత వ్యాసాలూ నిదర్శన కోశాలు. ఎన్ని పదవులు అధిరోహించినా ఆచార్య దొణప్ప వ్యక్తిత్వం ఫలభార వినమ్రతరువరం.

- ఆచార్య సి. నారాయణ రెడ్డి.
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయకులపతి.



# మా 'స్టార్'

"ఉత్తమ గురువులు దొరకుట
చిత్తంబున నెంచిచూడ, చేసిన పుణ్యా
యత్తము దొణప్ప గురువై
హత్తుట నాభాగ్యమనుచునహరహమెంతున్" (1986)

– అన్నారు ఆచార్య బేతవోలు రామబ్రహ్మం. దొణప్పగారి శిష్యులందరూ అలాగే అనుకొంటారు. చెళ్ళపిళ్ళ గురువని చెప్పుకోవటం ఆనాడు గర్వమైతే 'దొణప్ప మాగురువు' అని చెప్పుకోవటం ఈనాటి శిష్యులకుగొప్ప.

*"సరస్వతికి కనురెప్ప*
*సాహిత్యాబ్ధికి తెప్ప*
*మాతెలుగు కెంతొగొప్ప"*

అంటూ శిష్యులూ, అభిమానులూ ఎల్లప్పుడూ కొనియాడుతూవుంటారు. దొణప్పగారి శిష్యవాత్సల్యం మరువలేనిది, అనూహ్యంకూడా. అందరినీ గుర్తుంచుకొనేవారు. వ్యక్తిగతమైన ఇబ్బందుల్ని ప్రస్తావించేవారు. కుశల ప్రశ్నలు వేసేవారు.

పాఠం చెప్పటంలో ఎంత నిజాయితీపరులో – ఎంతటి అంకితస్వభావులో అనుభవం ద్వారానే తెలుస్తుంది. విశ్వవిద్యాలయాల్లో ఆచార్యపదవిలో ఉన్నవారు చాలామంది తరగతులకి రావడమేతక్కువ. వచ్చినా పాఠ్యేతర విషయాల ప్రస్తావనాఉంటుంది. సమయపాలన పాటించరు. వీటికి దొణప్పగారు మినహాయింపు. ఆయన క్లాసు మానరు, క్లాసుకువస్తే పాఠంచెప్పకమానరు. పాఠ్యేతర అంశాలజోలికి పోరు. 'భాషాచరిత్ర' అనే కొత్త పాఠ్యాంశాన్ని పసందుగా బోధించేవారు. వీరి బోధనా మహిమవల్ల ఎందరో భాషాశాస్త్రవేత్తలయ్యారు. విమర్శకులయ్యారు. పరిశోధకులయ్యారు. పరిశోధకులకు సూచనలిస్తూ, హెచ్చరిస్తూ మార్గదర్శకం చేస్తారు. ఎక్కడా రాజీపడరు. పైకిఎంత గంభీరంగా, సీరియస్‌గా ఉంటారో – అంతరంగం అంత సుస్నితం. మరింత అనురాగమయం.

శిష్యులు ఉత్తరంరాస్తే వెంటనే సమాధానమిచ్చేవారు. ఉత్తరాలు రాయటంలో ఎంతో ఆసక్తిచూపుతూ–అల్పాక్షరాలలో అనల్పార్థ రచనచేసేవారు. శిష్యులు వ్యాసాలలోకానీ, పుస్తకాలలోకానీ పొరపాట్లురాస్తే సహించేవారుకాదు. సవరిస్తూ ఉత్తరంరాసేవారు. అటువంటి అనుభవం ఈ వ్యాసరచయితకీ వుంది. అయితే చేరాగారి అనుభవం ఉదాహరిస్తాను–

"తెలుగు భాషాచరిత్రలో ఆధునికభాష గురించి వ్యాసంరాస్తూ మూడక్షరాల మాటల్లో చివరిహల్లు శ్వాసమైతే మధ్యహల్లుకూడా శ్వాసమౌతుంది అని

ఒకసూత్రంచేశాను. నేనుచేసిన సూత్రీకరణకు విరుద్ధమైన మాటలు పట్టికవేసి పంపారు...... దీనిఫలిత మేమిటో తెలుసా! ఆపుస్తకం రెండోముద్రణలో ఆసూత్రం ఎత్తేశాను. అంటే తప్పుసవరించుకున్నానని వేరేచెప్పక్కర్లేదు. దొణప్పగారి నిశిత పరిశీలనకు ఇది ఒక చిన్న ఉదాహరణమాత్రమే"(మూడరవైల దొణప్ప ప్రత్యేక సంచిక-1987)

ఇటువంటి సన్నివేశాలూ, అనుభవాలూ చాలామందికి చాలావున్నాయి. ఏపదవి అలంకరించినా-ఆపదవికి వన్నె తెచ్చారుతప్ప అపకీర్తి తేలేదు.

దొణప్ప మాస్టారుని శిష్యులంతా మా "స్టార్"గా భావిస్తారు. నాకు రాసినకొన్ని ఉత్తరాలలో ఆయనే స్వయంగా "మీ"★ అనిరాసేవారు కూడా. ఆయన ఉత్సాహ ప్రోత్సాహాలు చాలామందిని "స్టార్" చేశాయి. 'స్టార్'లకు స్టార్-మా దొణప్ప మాస్టార్. మాంటిసోరి విద్యాసంస్థలు-కోటేశ్వరమ్మగారి ఆధ్వర్యంలో ప్రచురించిన ప్రత్యేక సంచికలో దొణప్పగారిని ఇలా స్తుతించారు-

*"పవిత్రమౌ తెలుగునాట*
*ప్రభవించిన ముత్యము*
*రాయలసీమ గళమున*
*వెలుగు లొలుకురత్నము*
*వారు దొణప్ప"*

ఇది స్తవంకాదు-వాస్తవం!! ఇటువంటి ఆచార్య తూమాటి దొణప్ప జీవిత రేఖలను తెలుసుకొందాం.....



# దొణప్పగారి జీవనరేఖలు

కొందరి జీవితచరిత్రలు తర్వాతితరానికి కనువిప్పు కలిగిస్తాయి. ఆత్మస్థైర్యాన్నిస్తాయి. జీవితతత్వాన్ని విశదీకరిస్తాయి. మాస్టారుగారి జీవితచరిత్ర ఈకోవకి చెందుతుంది.

అనంతపురంజిల్లా-ఉరవకొండ మండలంలో 'రాకెట్ల' గ్రామంలో తూమాటి దొణప్పగారు జన్మించారు. ఆగ్రామానికి మోతుబరి అయిన తూమాటి బూదిగుమ్మయ్య కొడుకు సంజీవప్ప, సావినేని కుటుంబానికి చెందిన తిమ్మక్కను వివాహం చేసుకొన్నారు. ఈసంజీవప్ప, తిమ్మక్కల పదిమంది సంతానంలో ఎనిమిదో సంతానంగా దొణప్ప పుట్టారు. వీరి అసలుపేరు దొణప్పకాదు-దొణతిమ్మారాయచౌదరి. పాఠశాలలో నమోదైన పుట్టినతేది 1-7-1926. కానీ కార్తీకమాసంలో పౌర్ణమినాడు పుట్టారట. సంవత్సరం అదేకానీ తిధిప్రకారం పౌర్ణమి!

దొణప్పగారి బాల్యమంతా కుటుంబ సంప్రదాయం ప్రకారమే సాగిపోయింది. చదువులేదు. ఇంగ్లీషు చదువుకుంటే కీడు అనిభావించిన రోజులవి. 'అలకాపరి'గా కాలం వెళ్ళబుచ్చే దొణప్పగారి జీవితం ఒక మలుపు తిరిగింది. దీనికి బూది గుమ్మయ్యగారి దాయాది భీమప్పగారు కారకులయ్యారు. ఈయన సంస్కృతాంధ్రాలలో పండితులు. పౌరాణికులు. హరికథా రచయిత. వీరికి లక్ష్మారెడ్డి మొదటి వాచకుడు. ఆతర్వాత దొణప్పగారు వాచకుడు. భీమప్పగారు భారత, భాగవత రామాయణాలు పురాణం చెప్తుంటే దొణప్పగారు వాచకుడుగా ఉండేవారు. భీమప్పగారి దగ్గరే సంస్కృతాంధ్రాలలో గట్టి పునాది పడింది. ఆతర్వాత గురుబాల ప్రబోధిక అధ్యయనంచేశారు. భాగవత ప్రవచనమూ చేశారు.

వజ్రకరూర్‌లో 1939-42 మధ్య విద్యాభ్యాసం కొనసాగించారు. అప్పట్లో ఎడ్లబండి మీదే రాకపోకలు. వజ్రకరూర్‌లో ఉండగానే దొణప్పగారు నాటకాలాడటం ప్రారంభించారు. చింతామణిలో 'చిత్ర' పాత్రను, 'సుభద్రా పరిణయం'లో కృష్ణపాత్రనూ, 'మోహినీ రుక్మాంగద'లో రుక్మాంగద పాత్రనూ ధరించటమే కాకుండా బహుమతులు కూడా పొందారు. 1942లో ఉరవకొండలో ఉన్నత పాఠశాలలో చేరారు. ఈ స్కూలులో నూతలపాటి పేరరాజుగారనే తెలుగు పండితునివల్ల దొణప్పగారికి ఆశుకవిత్వం అబ్బింది. అప్పటి జిల్లా బోర్డు అధ్యక్షులు అడిగితే దొణప్పగారు శార్దూలాది వృత్తాలలో కారును వర్ణిస్తూ చెప్పారట! 1946లో ఉరవకొండ ఉన్నత పాఠశాలనుంచి ముప్పయి ఇద్దరు విద్యార్థులు ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షకు హాజరైతే కేవలం అయిదుగురే ఉత్తీర్ణులవగా వారిలో దొణప్పగారొకరు.

దొణప్పగారు ఎనిమిదో తరగతిలోనే "చంద్రుడు-కలువ" అనేకథ రాయటం, 'చిత్రగుప్త' పత్రికలో అచ్చుకావడం గమనార్హం. హైస్కూలు విద్యార్థిగా అప్పటి

'వినోదిని', 'ఆనందవాణి', 'ఢంకా', ప్రజాబంధు వంటి పత్రికలలో పద్యాలూ, గేయాలూ, వ్యాసాలూ రాసేవారు. అనంతపురం కళాశాలలో ఇంటర్మీడియేట్ చదవడంతో శంఖవరం రాఘవాచార్యులు (సంపత్) వంటి హేమాహేమీల బోధనతో మరింతగా ప్రతిభావంతులయ్యారు. చిలుకూరి నారాయణరావుగారు ఈ కళాశాలలో ఉపన్యాసాలివ్వడం దొణప్పగారిలో భాషాపరిశోధనకి నాంది పలికింది. ఆచార్య గంటిజోగి సోమయాజి ప్రధానాచార్యులుగా ఉండగా ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగు ఆనర్స్‌లో చేరారు. అప్పటికే రాయలసీమలో జానపదంపై కొంతకృషి చేశారు. 1949లోనే ఆంధ్రప్రభలో మాండలికాలపై వ్యాసాలురాశారు. గంటిజోగి సోమయాజి, దువ్వూరి వెంకట రమణశాస్త్రి, కె.వి.ఆర్ నరసింహం, భద్రిరాజు కృష్ణమూర్తి, మధుసూదన షడంగి వంటి ఉద్దండులు దొణప్పగారి గురువులు. ఒకపక్క చదువుకుంటూ వేరొకపక్క సేవాకార్యక్రమాల్లో విద్యార్థి సంఘాలలో చురుకుగా పాల్గొనేవారు. ఆనర్స్‌లో "ద్రవిడయన్ ఫిలాలజీ అండ్ జనరల్ లింగ్విస్టిక్స్"ను ప్రధానాంశంగా తీసుకొన్నారు. దాంతో చిలుకూరి నారాయణరావుగారి ఆర్య భాషావాదం నుంచి బయటపడి ద్రావిడ భాషావాదం వైపు దృష్టిమరలింది. 1953లో దొణప్పగారి ఆనర్సు చదువు ముగిసింది.

1953 ఆగస్టు 29వ తేదీన ముండ్లూరి హనుమప్పగారి ఏకైక పుత్రిక గోవిందమ్మగారితో వివాహమైంది. అనకాపల్లి, గుడివాడ కళాశాలల్లో ఉద్యోగాలు వచ్చినా ససేమిరా అంటూ దొణప్పగారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో గంటిజోగి సోమయాజి దగ్గర పరిశోధక విద్యార్థిగా జేరారు. "తెలుగులో వైకృతపదాలు" అనే అంశంపై పరిశోధన చేపట్టారు. 1954లో దక్కన్ కళాశాల-పూనాలో భాషావిజ్ఞానంపై ప్రత్యేక శిక్షణా తరగతుల్లో పాల్గొన్నారు. అక్కడ సునీత కుమార్ ఛటర్జీ, సుకుమారసేన్ వంటివారి శిక్షణ మరింత లాభించింది. 1957వ సం.లో గంటిజోగి సోమయాజిగారు ముఖ్య సంపాదకులుగా ఉన్న "తెలుగువ్యుత్పత్తి పదకోశము" నిర్మాణంలో సహాయకుడిగా చేరారు. 1958లో ఆంధ్రశాఖలో ఉపన్యాసకులుగా చేరారు. 1970-76 సంవత్సరాలలో "తెలుగువ్యుత్పత్తి పదకోశం" సంపాదకులయ్యారు. 1966లో పి.హెచ్.డి. పట్టాపొందిన దొణప్పగారు 1970లో తెలుగుశాఖకి ప్రధానాచార్యులయ్యారు.

1976లో నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ప్రధానాచార్య పదవి అధిష్ఠించారు. అక్కడే రిజిస్ట్రార్‌గా, కళాశాల అధ్యక్షులు (ప్రిన్సిపాల్)గా పనిచేశారు. 1985లో ఎన్.టి. రామారావుగారు తలపెట్టిన అకాడమీల విలీనం సందర్భంగా స్థాపించబడిన తెలుగు విజ్ఞానపీఠం ప్రత్యేకాధికారిగా, అంతర్జాతీయ తెలుగుసంస్థ సంచాలకులు (డైరక్టర్)గా నియుక్తులయ్యారు. ఆతర్వాత తెలుగు విశ్వవిద్యాలయం మొదటి కులపతి (వైస్ ఛాన్సలర్)గా 1986, జనవరి 8వ తేదీన పదవీ స్వీకారం చేశారు. దొణప్పగారికి ముగ్గురు బిడ్డలు. అనూరాధ, సుజాతలు కూతుళ్ళు ఏకైకపుత్రుడు సుధాకర్. అనూరాధ డాక్టర్‌కాగా, సుజాత లెక్చరర్. సుధాకర్ కేంద్ర ప్రభుత్వశాఖ 'APEDA'లో అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేస్తున్నారు.

దొణప్పగారు వస్త్రధారణలో సూటుబూటుకి ప్రాధాన్యం ఇచ్చేవారు. శాంతస్వభావులు. ఎప్పుడన్నా కోపంవస్తే అది గడ్డిమంట వంటిదే. వీరిశిష్యురాలు ఆచార్య తమ్మారెడ్డి నిర్మలగారి మాటలు ఈసందర్భంగా తెలుసుకొందాం - "మాస్టారికి కోపం రావటం చాలా అరుదు. ఎప్పుడైనా పొరపాటుచేస్తే 'ఏంతల్లీ! ఇలాచేశావు' అనేవారు. అదికోప్పడటమన్నమాట. మాస్టారి బోధనా పద్ధతి, విద్యార్ధులపట్లగల వాత్సల్యం, శాంతస్వభావం, సహనం వారికింత శిష్యసంపదను కూర్చి పెట్టాయి".

ఆచార్య వి.రామచంద్ర (మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ ప్రధానాచార్యులుగా పనిచేశారు) దొణప్పగారి వ్యక్తిత్వాన్ని ఎలా వెల్లడించారో చూడండి - "ఎవరెంత వేధించినా ఆయనకు కోపంరాదు. అకారణంగా ఆయన్ని ద్వేషించే వ్యక్తులను గురించి గూడా ఆయన పల్లెత్తుమాట అనడం నేను వినలేదు. ఆయన కోపాన్ని జయించిన మహర్షి. ఎన్నో సమస్యలతో సతమతమవుతున్నా తొణకరు. బెణకరు. ఆయన స్థితప్రజ్ఞులు" ఆనర్సు కోర్సులో స్నేహితులైన ఆంగ్లోపాధ్యాయులు అట్లూరు పురుషోత్తంగారు దొణప్పగారి జీవితంలోని విశేషాలు తెలుపుతూ అంటారు- "దొణప్పగారు తెలుగు ఆనర్సు విద్యార్థిగా ఉన్నప్పుడు కొంతకాలం వారి ఆరోగ్యం కొంచెం ఆందోళనకరంగా ఉండేది. వారు సుమారు నెలకొకసారి హఠాత్తుగా పడిపోయేవారు. వెంటనే మేము కింగ్‌జార్జి ఆస్పత్రికి వారిని తీసుకొనివెళ్లేవాళ్ళం. ఓవారం లోపలవారు తిరిగి హాస్టల్‌కి వచ్చేవారు. తత్ఫలితంగా వారి చదువుకు ఆటంకం కల్గింది. వారికాలం ఒక సంవత్సరం వృధాఅయింది. అయినా దొణప్పగారు వారి ప్రాంతంలో ఆయుర్వేద వైద్యం చేయించుకొని, ఆరోగ్యవంతులై, పట్టువిడువకుండా ఆనర్సు చదువు విజయవంతంగా పూర్తిచేశారు."

ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం చేసేరోజుల్లో ఆచార్య దొణప్ప "ఎప్పటికైనా హైస్కూలు హెడ్మాస్టరు కావాలి" అనుకొనేవారట. కానీ విశ్వవిద్యాలయానికే కులపతి అయ్యారు. కానీతాను ఎక్కివచ్చిన సోపానాలను మరువలేదు. తన పునాదిని మర్చిపోలేదు తాను చదువుకొన్న రాకెట్ల, వజ్రకరూరు, ఉరవకొండజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలల్లో దొణప్పగారు మూడు బహుమతులు నెలకొల్పారు. స్కూల్ ఫైనల్ పరీక్షలో ప్రథమ స్థానం పొందినవారికి ఈ బహుమతులు ప్రదానంచేస్తారు. దొణప్పగార్కి బహుమతులు పుచ్చుకోవడంలో కంటె ఇవ్వడంలోనే ఆనందం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డులు మూడుసార్లు స్వీకరించిన దొణప్పగారు ఎంతటి వినయ భూషణులో ఈమాటలు వెల్లడిస్తాయి -

"అకాడమీ బహుమతులొస్తే మోకాలొడ్డే మోరకుణ్ణి కాకపోయినా వాటికోసమే నేను పరిశోధనలు చేయడంలేదనీ, నాపరిశీలనా ఫలితాలను ప్రకటించడంలేదని మనవి చేసుకుంటున్నాను సత్కారాలందుకోవడంసమ్మానాలు పొందడం ఒకవిధంగా చూస్తే తలకుమించిన పని అనిపిస్తుంది. వీటితో సమ్మానితులకు బరువు బాధ్యతలు పెరుగుతాయి. సమ్మానాల తరువాత సమ్మానితుల కృషి ఎలాసాగుతుందో అని విమర్శకలోకం వెయ్యికళ్ళతో

నిఘావేసి చూస్తుంటుంది. దాని కనుగుణంగా మసలుకోవడం మాటలుకాదు. అందుకే సమ్మానితులకి ఒక సవాలు అంటాను. సవాలు స్వీకరించక తప్పదు".

ద్రోణప్పగారు పాఠం చెప్పే పద్ధతి విశిష్టంగా, విలక్షణంగా వుంటుంది. ఆసక్తికరంగా వుంటుంది. ఉచ్చారణ ప్రత్యేకంగా, స్పష్టంగా స్ఫూర్తిదాయకంగా వుంటుంది.

"వారి తెలియమికి నవ్వు కొంటాం"

"ఇవి శిశుబుద్ధుల పనులు"

వంటి మాటలెన్నో ప్రసక్తంగా వస్తాయి. వారిభాషను పరిశీలిస్తే కొత్త పదసంపద కలుగుతుంది. ఓసారి

"నాకు తెలిసినంత ప్రాకృతం అప్పకవికి తెలీదు" అన్నారు. నేను ఆశ్చర్యపోయాను. నిజమా?" అనే సందేహం ఉండేది. ఆతర్వాత చాలా సంవత్సరాలకి ఈవిషయమై తిరుమల రామచంద్రగారిని అడిగితే వెంటనే "అక్షరాలా నిజమైనమాట" అన్నారు. అప్పుడూ ఆశ్చర్యపోయాను.

క్లాసుకి రాగానే ద్రోణప్పగారు అంతకుముందు రోజు క్లాసులో చెప్పిన పాఠంపై ప్రశ్నలు వేసేవారు. విశ్వవిద్యాలయంలో "బ్లాక్‌బోర్డ్" వాడే అతికొద్ది ఆచార్యులలో వీరొకరు. అడిగిన ప్రశ్నలకి సమాధానం చెప్పకపోతే – ఆవిద్యార్థుల నేపథ్యం తెలుసుకొన్న ద్రోణప్పగారు ఇలా మందలించేవారు:

"ఏమండీ, కథలూ కాకరకాయలూ రాసుకుంటూ వుంటే ఎలా?"

"ఏమండీ లేడీస్ హాస్టల్‌కి వెళ్తూ కాలక్షేపంచేస్తే డిగ్రీ వస్తుందా?"

"విద్యాతురాణాం ననిద్రా నసుఖం అన్నారు తెలుసా"?

ఇంతమంచి మాస్టారును ఎంతో గౌరవిస్తాను. ఇంకెంతో పూజిస్తాను. అయితే నాకు విశ్వవిద్యాలయంలో ఉద్యోగం ఇవ్వలేదని కొంచెం కినుకవుండేది. ఇదే విషయం అడగటానికి ధైర్యంచాలదు. కులపతి పదవి ముగిసిన తర్వాత సాహసంతో అడిగేశాను – "నేను, ఆచార్య తిరుమల వంటి వారందరం మీ శిష్యులం. మాకృషి మీకు తెలుసు. మమ్మల్ని పైకి తీసుకువచ్చే ప్రయత్నం మీరు ఎందుకు చెయ్యలేదు".

ద్రోణప్పగారు అయిదు నిముషాలు మౌనం వహించారు. నాకు గుండెదడ. ఏమని చెప్తారా – అని ఉత్కంఠ! "నిజమే శాస్త్రీ. మీకు చేయవలసిందే. చెయ్యలేకపోయాను" అన్నప్పుడు నన్ను నేను నిందించుకొన్నాను. ద్రోణప్పగారి విచారవదనాన్ని చూడలేకపోయాను. వెంటనే అన్నాను "మీరు ఉద్యోగం ఇప్పించకపోయినా .... మీరు మాకు ఆరాధ్యదేవుడు సార్. మీవల్లనే ఇంతవారమయ్యాం. సందేహం ఉన్నప్పుడు అడగటం తప్పుకాదని పెద్దన సిద్ధుడి ద్వారా అనిపించాడు. అందుకే సార్. క్షమించండి". ఆయన "అంతమాట వద్దు. ఇప్పుడు ఏంరాస్తున్నావ్?" అని విషయాంతరానికి వెళ్ళారు. అప్పుడు చూశాను గురువుగారి గంభీర స్వరూపాన్ని ... నిష్కల్మష హృదయాన్ని ... కాదు, శిష్య వాత్సల్యాన్ని!! ఆప్రశ్న ఎందుకడిగానా అని దిగులు చెందాను. ద్రోణప్పగారు ఎంత మంచివారంటే నామిత్రుడు, సహాధ్యాయుడు ఆచార్య తిరుమలతో అన్నారట – "మీరూ, ద్వానా శాస్త్రిగారు గాడ్‌ఫాదర్ లేకుండానే పేరు తెచ్చుకొన్నారు". వారి సహృదయతను ఎలా మర్చిపోగలం?

అధికార భాషా సంఘం అధ్యక్షులయిన తర్వాత ఎన్.టి.రామారావుగారితో చెప్పి-ఇంటర్‌స్థాయి వరకు తెలుగుభాషా బోధనను నిర్బంధం చెయ్యాలని ఒప్పించారు. కొద్దికాలంలో ప్రభుత్వ ఉత్తరువు వెలువడటానికి రంగం సిద్ధమైంది. ఇంతలో రాజకీయాలలో అనూహ్య మార్పులు చోటు చేసుకొన్నాయి. ఎన్.టి.రామారావుగారు పదవీచ్యుతులయ్యారు. దొణప్పగారు కూడా అధికార భాషాసంఘం అధ్యక్షపదవికి రాజీనామా చేశారు. విజయవాడలో అకస్మికంగా సెప్టెంబరు 6, 1996న మరణించారు.

ఇలా చెప్పుకుంటూ వెళ్తే ఎన్నో విశేషాలున్నాయి. దొణప్పగారివంటి మహోన్నతవ్యక్తి దొణప్పగారే అనటం సమంజసం. దొణప్పకాదు – ద్రోణప్ప అని మావంటి శిష్యులు ద్రోణాచార్యులుగా భావిస్తాం. మా మాస్టారు దొణప్పగారిని డాక్టర్ అంతటి నరసింహంగారి పద్యంలో దర్శిద్దాం–

*"స్వాంతము శాంతమయ్యది విశాలము, తత్ప్రతిబింబరూపమ*
*త్యంతము శ్రీదొణప్ప దరహాస ముఖమ్ము తిరిక్తమైనప్ప*
*త్రాంత యశోవిశాలత వితానకముల్, తన సర్వకృత్యమల్*
*నాంతములా మనీషి వివిధాలగు పొందిరిప్రాభవమ్ములున్"*

దొణప్పగారు చాలాగంభీరంగా (సీరియస్‌గా) కనిపిస్తారు. పాఠం చెప్పేటప్పుడు గంభీరంగా చెప్తూనే సున్నితంగా చెణుకులూ, విసుర్లూ విసురుతూవుంటారు. పని దగ్గరకురాగానే "బాబోయ్" అనిపిస్తారు. ఎం.ఏ. తెలుగులో చివరి క్లాసులో దొణప్పగారు పలికిన ఈ బంగారుమాటలు నన్ను వెంటాడుతూ వుంటాయి –

"ఎం.ఏ డిగ్రీ వచ్చినంత మాత్రాన మీరు పండితులైనట్టు కాదు. ఇకనుంచి మీరు తెలుగు సాహిత్యం చదవడానికి, పరిశీలించడానికి అర్హులని అర్థం. ఇంతటితో పఠన పారనాదులకు స్వస్తి పలకకూడదు. మీరు నిత్య విద్యార్థులుగా ఉండాలి. బియ్యం కొట్లోకి వెళ్ళినప్పుడు చారెడు బియ్యం తీసుకొని ఏబియ్యం బాగున్నాయోచూస్తాం. ఈ డిగ్రీకూడా అంతే. మీరు ఏదిచదవాలో, ఎలా చదవాలో చెప్పేది. ప్రపంచంలోని విజ్ఞానం సముద్రమంత. మనం శ్రమిస్తే తెలిసేది బిందువంత. ఏపాత్రతో తోడుకుంటే అంతే లభిస్తుంది. చివరగా నామాట–

*"నలుగురు కూచుని నవ్వేవేళల*
*నా పేరొకపరి తలపండి."*

శిష్యులు ఎక్కడన్నా కనిపిస్తే కుశల ప్రశ్నలతో ఆపేవారు కారు. "ఏంచదువుతున్నారు"? "ఏంరాస్తున్నారు"?. నావంటి రచయితలతో "మీ రచనలవల్ల నాకు పేరు రావాలి. దొణప్పగారి శిష్యుడు ఇలా రాశాడా? అనిపించుకోకూడదు".

ఎం.ఏ చదువుతున్నప్పుడు విద్యార్థులంతా కలసి అరకువాలీకి పిక్నిక్‌కి వెళ్ళాం– దొణప్పగారితో పిక్నిక్‌లో, పిల్లలతో కనిపించే దొణప్పగారు వేరు. చాలా సరదాగా వుండేవారు. బస్సులో చివరిసీటులో కూర్చుని కొందర్ని పిలిచి అల్లరి పనులు చేయించేవారు. పాటలుపాడించేవారు. నాచేత "ఎక్కడికి వెళ్తున్నాం గోంగూరకి ... ఎందుకు వెళ్తూన్నాం గోంగూరకి" పాట పాడించారు.

ద్రోణప్పగారి దగ్గర ఎం.ఫిల్ చెయ్యటంవల్ల ఎంతో నేర్చుకున్నాను. మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు) గారిపై యు.జి.సి వారు F.I.P. పథకంలో నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశాను. పరిశోధనలో రాజీపడలేదు. "అక్కడికి వెళ్ళండి ... ఈయన్ని కలవండి... అది వాకబు చెయ్యండి... ఆ ఫోటో సేకరించండి." అంటూ ముప్పతిప్పలు పెట్టారు. అప్పట్లో కొంచెం బాధపడ్డాను. "మేష్టారూ... ఎం.ఫిల్ కోసం ఎందుకండీ ఇంతగా కష్టపడాలి. పి.హెచ్.డి కాదు కదండీ" అన్నాను. "ఏదయినా ఒకటే. కవిగారిపై నువ్వు సరిగా చెయ్యకపోతే ఇక ఎవ్వరూ చేయలేరు. నామాట విను" అన్నారు. అయితే అప్పుడంతగా కష్టపడటంవల్లనే విషయసేకరణా పద్ధతులు, రచనా ప్రణాళిక, విమర్శరీతులు మొదలైన అంశాలు తెలిశాయి.

ఇంతగా శిష్యుల్ని అభిమానించి, శిష్యుల అభ్యున్నతిని కోరే ద్రోణప్పగారిలో నాకు నచ్చని అంశాలు రెండున్నాయి -

మొదటిది తనను గౌరవించి, తనవల్ల స్ఫూర్తిపొంది అంతోఇంతో కృషిచేస్తున్న నావంటి శిష్యుల్ని "పైకి" తీసుకురాకపోవటం

రెండోది- వారింటికి ఎప్పుడు వెళ్ళినా నాకుమాత్రం మంచినీళ్ళు అడిగితే ఇచ్చేవారు. కాఫీ ఇచ్చేవారు కాదు. మానాన్నగారిని ఇంటికి తీసికెళ్ళినా ఇదే అనుభవం.

అయితే-ఆయన ఆదర్శ వ్యక్తిత్వంముందు, ఆసాహితీమూర్తి కృషిముందు, ఆయన శిష్యవాత్సల్యంముందు ఇవి అల్పాతిఅల్ప విషయాలు-అని తెలుసు.



# దొణప్పగారి రచనలు

విద్యార్థి దశలో : చంద్రుడు-కలువ (కథ)
ఆదర్శ శిఖరాలు (ఏకాంకిక)
అన్వేషణ (గేయం)
హాస్టలు చరిత్ర (ప్యారడీ-దేశచరిత్రకి)

సాహితీవేత్తగా : 1. ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణము
2. భాషా చారిత్రక వ్యాసావళి
3. తెలుగులో కొత్తవెలుగులు
4. జానపద కళాసంపద
5. తెలుగు హరికథా సర్వస్వం
6. వైకృత పదస్వరూప నిరూపణము (సిద్ధాంత గ్రంథం)
7. ఆకాశ భారతి

అముద్రితాలు : 1. మీపేరేమిటి?

తెలుగువారి ఇంటి పేర్లు, నామధేయాలు, గ్రామనామాలు, కలం పేర్లు .... వీటి పుట్టు పూర్వోత్తరాలను భాషాపరంగా, చరిత్రపరంగా, సంస్కృతీపరంగా లోతుగా పరిశోధించి రాసిన సుమారు వెయ్యి పుటల గ్రంథం వ్రాతప్రతిగానే వుంది.

**2. పురాణ ప్రవచనం**

తెలుగునాట పురాణ ప్రవచన సంప్రదాయం గురించి, పౌరాణికాలు గురించి ఎంతో సమాచారసేకరణతో చేసిన విశేషకృషి అసంపూర్ణంగా, అముద్రితంగా వుండిపోయింది.

**3. ప్రసంగతరంగిణి**

సంపాదకులుగా : 1. తెలుగు వ్యుత్పత్తి పదకోశము
2. త్రివేణి (జానపద గేయ సంపుటి)
3. మాండలిక వృత్తి పదకోశము
4. Journal of Telugu Studies (Published by Telugu University)
5. అన్వేషణ పత్రిక (నాగార్జున విశ్వవిద్యాలయం)



# దొణప్పగారి రచనల పరిచయం

**1. ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణము**

"ప్రాచీనమును వర్తమానముతో సమన్వయించి, భవిష్యత్తునకు పథకములు రచియించుట ప్రగతికి ప్రథమ సోపానము. ఈ పరమార్థము ప్రధాన లక్ష్యముగా గలిగిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు పోటీకి ప్రకటించిన వ్యాస విషయమును పురస్కరించుకొని రూపెత్తిన రచనమిది" అని దొణప్పగారు "మనవి మాటలు"లో తెలిపారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అప్పటి అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి సూచనమేరకు వ్యాసరచన పోటీ నిర్వహించగా దొణప్పగారి ఈ రచనకు బహుమతి వచ్చింది. ఈ గ్రంథాన్ని సమగ్రం చెయ్యాలనే తలంపుతో విజయనగర సంస్థాన చరిత్రను అదనంగా చేర్చారు.

"ముఖబంధము" పేరుతో దొణప్పగారు రాసిన ముప్పయిపుటల ఉపోద్ఘాతం అత్యంత విలువైనది. తెలుగు సాహిత్య చరిత్రని కొండ అద్దమందులాగా ప్రదర్శించి భావిపరిశోధకుల మెదడుకి మేతనందించారు. ముఖ్యమైన నలభైఆరు సంస్థానాలను వివరించి చివరలో "పరిశిష్టము" అనే అధ్యాయంలో చిన్న సంస్థానాల, ఎస్టేటుల చరిత్రను అకారాద్యనుక్రమంలో సంగ్రహంగా తెలిపారు. ఇవికాక ఇంకా మరోపాతిక సంస్థానాలు ఉన్నా-వాటి చరిత్ర అఱకొఱగా ఉండటవలన, సామాగ్రీ లోపంవలన, గ్రంథ విస్తరభీతివలన చేర్చలేదని విన్నవించారు. ఇప్పటికే అచ్చులో ఇది 624 పుటల గ్రంథం.

డాక్టర్ వి.వి.యల్. నరసింహారావుగారు ఈ పుస్తకాన్ని గురించి పలికిన అక్షరసత్యాలు- "సముద్రానికేతామెత్తినట్లు విషయం సేకరించటం జరిగింది. ఇది మామూలు పనికాదు, మహాయజ్ఞం. చరిత్ర నిరూపణబుద్ధికి మాత్రమే కాక శరీరానికి కూడా చిరకాల శ్రమ తప్పదు. సాహిత్యపోషణలో ఏ సంస్థానం ఎంతెంతగా శ్రద్ధాసక్తులు ప్రదర్శించిందో చెప్పేచోట రాగ ద్వేషాలకు అతీతమైన దృష్టితో తరతమభేదాలు నిరూపించటం రచనలోని మరోవిశేషం".

రాజ్యాలు, సామ్రాజ్యాలు అంతరించిన తర్వాత ఆంధ్రసాహిత్య పోషణం బరువు బాధ్యతలను చేతనైనంతవరకు స్వీకరించి సాకిసంరక్షణ చేసినవారు సంస్థానాధీశులే. దాదాపు నూటొక్క సంస్థానాలు సాహిత్య, కళాపోషణ గావించాయి. ఉత్తరాంధ్రలోగల జమీందార్లు, పశ్చిమాంధ్రలోని పాళయాలు, తెలంగాణంలోని సంస్థానాల పోషణలో పరిపుష్టమైన ఆంధ్ర సాహిత్యం ఎన్నిపోకడలు పోయిందో దొణప్పగారు అపూర్వమైన కృషితో వివరించారు. చారిత్రక, సామాజిక అంశాలను కూడా విశేషంగా తెలిపారు. ఇంత బృహత్కృషి చేసిన దొణప్పగారి వినయ సంపద

చూడండి: "నిర్దిష్ట విషయ పరిధి చాలా యెక్కువ: ఉన్న వ్యవధి మఱీ తక్కువ. అందును ఉఱుకుల పరుగులమీద పనిసాగించుట వలన వెనుదిరిగి చూచికొనుటకు ఉసులుబాటు దొరకినదికాదు. ఉన్నంతలో విబుధజనుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపఱచుటకీయెత్తుగడ".

దొణప్పగారు ఎందరో అజ్ఞాతకవుల్నీ, అజ్ఞాతరచనల్నీ ఈ పుస్తకంద్వారా వెలుగులోకి తెచ్చారు. ఎన్నోచాటు పద్యాలు, శతకాలు ఇందులో బహిరంగమవుతాయి. దొణప్పగారి శైలీ సామర్థ్యానికీ, వ్యాఖ్యాన కుశలతకీ రెండుదాహరణలు :

"చిన్న వయసులో భర్తపోయి జమీపాలనమను పెద్దబరువు తలమీద పడినను దొడ్డబుద్ధిగల మహాలక్ష్మమ్మగారు ఉభయ కులపవిత్రగా సాగరాంధ్రము నందలి సంస్థానాధీశులలో సాటిలేని సత్కీర్తిని సంపాదించినది".

"చిత్ర, బంధ, గర్భ కవిత్వములు, బహ్వర్థక కావ్యములు, ఆశుకవితలు ప్రబలుటకు సాహిత్యస్రష్టలలో కళాదృష్టి తక్కువయి, శాస్త్రదృష్టియెక్కువగుటయే హేతువు. శతకాదులును, కొన్ని ప్రబంధములును ద్రాక్షాపాకమున సంతరింపబడినవి. ప్రౌఢకవులు చేయివేసిన ప్రబంధములు కొన్ని నారికేళపాకమున పడినవి. కొన్ని ప్రబంధములలో నీపాకము ముదిరి పాషాణపాకముగా మాఱినది. నారికేళపాకములయిన కొంత నయమే, కొన్నింటి రీతిపిశాచనారికేళపాకము"

**2. భాషాసంబంధి రచనలు**

"ఒక సమస్యకు ఓ మాదిరి పరిష్కారం కన్నా ప్రత్యేక పరికరాలు, సాధనల పద్ధతులను ఉపయోగించుకొని మరింత సమగ్రమైన పరిష్కారాన్ని కనుగొనే వ్యవస్థీకృత ఆలోచనా పద్ధతి పరిశోధన. ఇది ఒక సమస్యతో మొదలై విషయాలను సేకరించి వాటిని విమర్శనాత్మకంగా విశ్లేషించి, వాస్తవాల మీద ఆధారపడిన నిర్ణయాలను చేసే దశకు చేరుకుంటుంది. ఇందులో కేవలం వ్యక్తిగత అభిప్రాయాలను ఉపయోగించుకోవడం కన్నా మౌలికమైన శ్రమ అవసరమౌతుంది. ఇది దేనినో నిరూపించాలనే కోరికకన్నా తెలుసుకోవాలనే ఆసక్తి నుంచి పుట్టుకొస్తుంది" అని సి.సి. క్రాఫోర్డ్ నిర్వచనాన్ని తెలుగులోకి అనువదించారు రాచపాళెం, బ్రహ్మానందలు (సాహిత్య పరిశోధన సూత్రాలు). ఈ నిర్వచనం ఆచార్య దొణప్పగారికి అక్షరాల అన్వయిస్తుంది. "వివేచన – సాలోచన – నిర్వచనాలు ముద్ద కట్టిన ఆదర్శమూర్తి. బోధన – భాషణ – శోధనలు రూపెత్తిన విమర్శకమూర్తి" అని శిష్యులు, అభిమానులు దొణప్పగారిని గురించి పలకటం వాస్తవమే. దొణప్పగారు సంస్కృత, ప్రాకృతాంధ్రాలలో విద్వాంసులు. తమిళ, కన్నడ, మరాఠీలతో బాగా పరిచయం గలవారు. భాషా పరిశోధనలో దొణప్పగారిది ప్రత్యేకమైన మార్గం.

భాషా శాస్త్రాన్ని తెలుగు సాహిత్యానికి బాగా తోడ్పడుతుందని నిరూపించిన వారు దొణప్ప. భాషాశాస్త్రం అనేది పాశ్చాత్యులదనీ, అదేదో అర్థం పర్థంలేని 'మేడ్ డిఫికల్ట్' లాంటిదనీ భావించేవారు లేకపోలేదు. అందుకు సమాధానమే దొణప్పగారి భాషా పరిశోధన. తెలుగు సాహిత్యానికి భాషాశాస్త్రాన్ని అన్వయించి తెలుగుపై కొత్త

వెలుగులు ప్రసరింపజేసిన వాళ్ళల్లో ఆద్యులనదగిన వారు దొణప్ప. సత్యస్వరూప నిరూపణం, ప్రామాణికత, సోదాహరణమూ సోపపత్తికమూ అయిన విశ్లేషణ – ఈయన పరిశోధనకు శాస్త్రీయతను చేకూర్చాయి.

దొణప్పగారు ఉత్తమ భాషా పరిశోధనకుడనటానికి ప్రప్రథమ సాక్ష్యం "వైకృతపదస్వరూప నిరూపణము" అనే సిద్ధాంత వ్యాసం. ఇంగ్లీషులో దీన్ని "Old and Middle Ind-Aryan Loan Words in Literary Telugu" గా పేర్కొన్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం వారు ఈ సిద్ధాంత గ్రంథానికి సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడు స్వర్ణపతకం బహూకరించారు. తెలుగులో ప్రవేశించిన వైకృతపదాల పరిశోధన మొదట (చివరగా కూడా) చేపట్టిన ఖ్యాతి దొణప్పగారికే దక్కుతుంది. తెలుగు సాహిత్యంలో సంస్కృతభవ, ప్రాకృతసమ, ప్రాకృతభవ శబ్దాలను (వైకృతపదాలు) పరిశీలించి ఏ విధంగా అవి ప్రయోగించబడ్డాయో, ఏ విధమైన మార్పులు చెందాయో తమ సిద్ధాంత గ్రంథంలో సప్రమాణంగా వివరించారు. తెలుగులో ఆధునిక యుగంలో ప్రాకృతభాష వచ్చిన వాళ్ళు చాలా తక్కువ. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య, చిలుకూరి నారాయణరావు, రాళ్ళపల్లి, పుట్టపర్తి, తిరుమల రామచంద్ర వంటి కొద్దిమందికి మాత్రమే ప్రాకృతభాషలో పాండిత్యం వుంది. వీళ్ళు భాషాపరంగా కన్న (చిలుకూరి, కోరాడ, తి.రా. తప్ప) సాహిత్యపరంగా కృషిచేసిన వారు. దొణప్పగారు భాషాశాస్త్ర నేపథ్యంతో ఈ పరిశోధనకి పూనుకొన్నారు. పైగా తెలుగులో వైకృత పదాల విభజన, నిర్ణయాలు సమస్యలతో వివాదాలతో కూడుకొన్నవి. మనలాక్షణికులు, నిఘంటుకారులు చేసిన పద విభాగాలు శాస్త్ర సమ్మతం కాదని చాలా మంది అంగీకరించారు. ఇటువంటి స్థితిలో వైకృతపద స్వరూప నిరూపణకు దిగి కృతకృత్యులవటం గమనించదగిన అంశం.

దొణప్పగారి పరిశోధన ప్రణాళిక నిర్దిష్టంగా వుంటుంది. సమగ్రంగా వుంటుంది. పరిశోధన సూత్రాల్ని ఈయన సిద్ధాంత గ్రంథాన్ని, వ్యాసాల్ని పరిశీలించి తయారుచేయవచ్చు అనిపిస్తుంది. పరిశోధన "ఒక బౌద్ధిక ప్రక్రియ", పరిశోధనకి మూలం "జ్ఞానతృష్ణ" అనేవి నిజమనిపిస్తాయి. "వైకృత పద స్వరూప నిరూపణము" అనే సిద్ధాంత వ్యాసం ప్రధానంగా రెండు భాగాలు. పరిశోధన, నిరూపణ, నిర్ణయం అనేవి మొదటి భాగానికి చెందుతాయి. ధాని ఫలితం రెండో భాగంలో పదపట్టికల ద్వారా ప్రకటింపబడుతుంది. అంటే విజ్ఞానశాస్త్ర పరిశోధనలాగా మొదటి భాగం సిద్ధాంతానికి నంబంధించినదైతే (Theory), రెండవ భాగం ప్రయోగానికి సంబంధించినదన్నమాట (Practical).

మొదటి భాగంలో మూడు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయం 'ముఖద్వారం'గా చెప్పవచ్చు. అంటే. ఆర్య ద్రావిడ భాషలు – సంస్కృత ప్రాకృత భాషలు – వాటి శబ్దజాలం – సంబంధాలు – వ్యాకరణానుసరణ మొదలైనవి ఇందులో వివరించబడ్డాయి. ఈ రంగంలో పూర్వం ఎవరెవరు ఏయే కృషి ఎలా చేశారో వివరించేది రెండవ అధ్యాయం. సాహిత్య పరిశోధనకి ఇది ఎంతో అవసరం. తమకు

ముందు జరిగిన పరిశోధనని తెలుసుకోలేకపోతే - పూర్వులకన్న బాగా పరిశోధన చెయ్యలేరు. ఆ విధంగా వివరించకపోతే దొణప్ప ప్రత్యేకంగా ఏం కృషి చేశారో తెలుసుకొనే వీలుండదు. తెలుగు, వైకృతపదాల ధ్వని పరిణామ ప్రక్రియల్ని మూడో అధ్యాయంలో వివరించారు. ఇది భాషా శాస్త్రపరమైన నిరూపణ. రెండవ భాగంలో వైకృత పదాలవ్యుత్పత్తి, అర్థ నిర్ణయం, ప్రయోగాలు తెలుపుతూ ఆకారాది క్రమంలో ప్రకటించిన పట్టికలు.

అసలు వైకృత పద నిర్వచనంలోనే భేదాభిప్రాయాలున్నాయి. వైకృత కావ్యాలంటే దేశ భాషా కావ్యాలన్నారు. తద్భవ దేశ్యాలను వికృతులు అన్నారు. వికృతి శబ్దాన్ని ఆచ్ఛికం అనే అర్థంలో వాడిన లాక్షణికులూ వున్నారు. మొత్తం మీద తత్సమ తద్భవాలకు వికృతి అని చాలా మంది చెప్పారు. సంస్కృత భవ, ప్రాకృత సమభవాలు వైకృతాలు అనికూడా చెప్పారు. ఇన్ని అభిప్రాయాలు తెలిసి చివరికి "ప్రస్తుత సమీక్షలో వైకృతమను పరిభాష తద్భవములను, ప్రాకృత సమములను కల సమాహార పదసముదాయమునకు చర్చా సౌలభ్యము నిమిత్తము పరిమితార్థమున ప్రయుక్తము" అని దొణప్పగారు తమ పరిశోధనా లక్ష్యాన్ని తెలిపారు. పూర్వలాక్షణికుల కృషిని పరిశీలించి "విహంగావలోకనం" అని అన్నారు గానీ అచ్చులో డెబ్బయి అయిదు పేజీలు వచ్చింది. అంటే ఈనాటి చిన్న ఎం.ఫిల్ సిద్ధాంత గ్రంథంతో సమానమన్నమాట! ప్రాచీనాంధ్ర లాక్షణికులు దాదాపు నలభై అయిదు మందిని పరిశీలించటం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇంత మందిని పరిశీలించి, పరిశోధించి దొణప్పగారు తేల్చిన సారాంశం ఇది - "శబ్ద జాల విభజనము సంబంధించినంత వరకు ఆంధ్ర లాక్షణికులలో పరిభాషా నిర్మాణము నందుగాని, ప్రక్రియా నిరూపణము నందుగాని, ప్రతిజ్ఞా నిర్వహణము నందుగాని ఏకవాక్యత మృగ్యము. వైకృతములకు సమీప మాతృకలను నిర్దేశించుటలోని మతభేదములననుసరించి ఆంధ్రలాక్షణికులు రెండు వర్గములు".

ధ్వని పరిణామ చరిత్ర అనే అధ్యాయం దొణప్పగారి అచ్చమైన భాషా కృషికి నిలువుటద్దం. వైకృత పదాలలో వర్ణాలను ఇంత విపులంగా, సహేతుకంగా వివరించిన భాషావేత్తలు లేరు. కృతక ప్రామాణికంగా హకారం ఎలా సంక్రమించిందో తులనాత్మకంగా వివరించారు. అ పదాది దీర్ఘ స్వరఘటిత పదాలన్నీ అర్వాచీన తద్భవాలని నిరూపించారు. సమీప మాతృకలో అ పదాది దీర్ఘస్వరం వుంటే దాన్ని హ్రస్వంగా మార్చి ఆంధ్ర భాషకు అనుగుణంగా వైకృత పదాలను రూపొందించటం ప్రాచీన లక్షణంగా నిర్ణయించారు. దొణప్పగారు నిరూపించిన కొన్ని వైకృత పదాలు:

అక్కోసము : సంతాపము (కళా. 3-179) కోపము (అచ్చ. రా. 6-200)
ప్రా.అక్కోస వ ద్వేషము, దూషణము. అమాగ (అర్ధమాగధి) -
అక్కోస పరుషవచనము. పాళి - అక్కోస నింద
అక్కసు
అక్కసు - అని వ్యవహార రూపములు.

అంబలి: పిండితో కొంచెము పలుచగా కాచిన పదార్థము.
అంబకళము వ ఒక దినుసు జావ (అము. 1-81. అప్ప 5-122)
ప్రా-అంబిల, అమాగ - అంబిలో జావ వంటి నీరు
అంబం మజ్జిగతో తయారుచేసినది, పాళి - అంబిలయాగు జావ
మాగధి - అంబిల, సం - అమ్ల = పుల్లపెరుగు
కన్నడము - అంబలి, అంబకళ, అంబిల, అంబుల, అమ్ల
మలయాళము - అంబవణ, అంబోణ, అంబిళ = జావ
తుళు - అంబులి = రాగి జావ

చారు : మిరియములులో నగు సంభారములు చేర్చి కాచిన చింతపంటి రసము (హర.2-31). నల్లచారు (హర.2-121). తియ్యచారు (ఉ.రా.5-289).

ప్రా.సార, అర్ధమాగధి, పాళి - సార, సం.సా.ర.

కన్న-చాఱు, సాఱు, తమి-చాఱు, చేఱు, మల-చాఱు. దేశ్యమని బరో. VI.P.144 DED 2050 'చాఱు' సాధువని దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. (సాహిత్యసమీక్ష పు.19) 'చారు' సాధువని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు (భారతి 1956 జులై) దేశ్యమన్నచో శకటరేఫ ఘటితము సాధువు. తద్భవమయినచో సాధురేఫ ఘటితము సాధువు. శకటరేఫ ఘటితమనుటకు నిర్ధారక ప్రయోగములు మృగ్యము.

ఈ మచ్చుపదాలను పరిశీలిస్తే దొణప్పగారు ఎంత ప్రామాణికంగా పద నిర్ణయం, అర్థనిర్ణయం చేశారో తెలుస్తుంది. తులనాత్మక పరిశీలన వల్ల, కావ్య ప్రయోగాలను ఉదాహరించడం వల్ల వీరి పరిశోధనకి శాస్త్రీయత, సహేతుకత చేకూరాయి.

దొణప్పగారి భాషా పరిశోధనా నైపుణ్యానికి మరొక ఉదాహరణ "భాషా చారిత్రక వ్యాసావళి". ఇందులో ఉన్నవి తొమ్మిది వ్యాసాలే. గ్రంథం మాత్రం మూడు వందల యాభైమూడు పుటలు. అంటే ఒక్కొక్క వ్యాసం ఎంత విస్తృతంగా రచించారో తెలుసుకోవచ్చు. దొణప్ప ఒక అంశాన్ని ఎన్నుకుంటే దాన్ని కూలంకషంగా - "అట్టుపుట్టానవాలు" - చర్చించి దాదాపు సమగ్రంగా అందిస్తారు. మరొకరెవరైనా ఈ అంశంపై రాయలేనంతగా పరిశోధిస్తారు. కొత్తవిషయాలను తెలపగల వారికి పూర్వరంగం అందిస్తారు. ఇది ఈయన పరిశోధనలో గల మరొక ప్రత్యేకత. "నన్నయ-అన్యదేశ్యాభాసములు" అనే రెండుభాగాల వ్యాసం ముప్పయిపుటలు ఆక్రమించుకొంది. "ఆంధ్రభాష - హకారాది పదములు" యాభైపుటలుగల వ్యాసం. పుటల్ని బట్టి పరిశీలనను అంచనావేస్తారా అని కాదు - సమగ్రతకి ఎంతటి ప్రాధాన్యమిస్తారో తెలుసుకోవడానికి వీలుందని చెప్పటమే ఉద్దేశం.

తెలుగు భాషా సాహిత్యాలలో గల అన్య దేశ్యపదాలపై దొణప్పచేసిన కృషి మరొకరు చేయలేదు. అసలు ఈ దిశగా విస్తృత పరిశోధన చేసిన వాళ్ళలో కూడా ఈయనే ప్రథములని చెప్పాలి. వికృతి వివేకం రచించినది అథర్వణుడా? అహోబల పండితుడా? అనే వివాదం బాగా ముదిరిన రోజుల్లో దొణప్పగారు "వికృతి వివేకకర్తృత్వము" అనే విశేష పరిశోధనా వ్యాసం రచించి సంచలనం కలిగించారు.

కొత్త కోణం నుంచి సోపపత్తికంగా ఎన్నో అంశాలువెలుగులోకి తీసుకొచ్చారు. భాషాపరమైన అంతరంగిక సాక్ష్యాలతో వికృతి వివేకం అధర్వణకృతంకాదని, అహోబలపండితుడే రచించి వుంటాడని, గ్రంథప్రామాణ్య సంసిద్ధికోసం అధర్వణుని పేరు వాడుకొని వుంటాడని ఈ అపూర్వవ్యాసంలో నిరూపించారు.

నన్నయ భారతంలో ఆదిపర్వంలో "ఏనూఱుగాడిదలను" అనే పాఠం వుంటే "ఏ నూఱుగాడీలు" పాఠమే ఔచిత్యమని కొందరు పేర్కొని గాడి పదం తురుష్క భాషావదమన్నారు. దొణప్పగారికి తమ భాషా పరిశోధనా పటిమను నిరూపించుకోవడానికి ఈ విమర్శ మంచి అవకాశమిచ్చింది. "ఏనూఱుగాడిదలను" అన్నదే సరియైన పాఠం అనటానికి తిరుగులేని సాక్ష్యాలు చూపించారు. గాడీ తురుష్క భాషాపదంకాదని, హింద్వార్యభాషాజన్యమైన అన్యదేశ్యమని ఎక్కడ లేని ఉపపత్తులను శోధించి సాధించారు. నవీన ఔత్తరాహ భాషలలోనిదని స్థాపించారు. ఒక్క పదస్వరూప నిరూపణకి ఇంత శ్రమించారంటే ఆయనలో ఎంతటి ఆసక్తి వుందో, ఎంతటి భాషా శక్తి వుందో తెలుసుకోవచ్చు. అలాగే నన్నయ వాడిన 'సవతి, సవతు' పదాలు కూడా అన్యదేశ్యాలన్న వాదనను భూస్థాపితం చేశారు.

"ఆంధ్రభాషయందలి హకారాది పదములలో రమారమి మూడింట రెండు వంతులు తత్సములు. తద్భవములు పదికి బొటాబొటి కన్నడము నుండి ప్రతిదేయములు నలువది పైచిలుకు. మిగిలిన వానిలో ముక్కాలు మువ్వీసము అరబ్బీ పారశీకాది భారతీయేతర భాషల నుండియు, మరాఠ్యాది నవీనౌత్తరాహ భాషలనుండియు సంసర్గవశము ప్రవేశించిన అన్యదేశ్యములు. ఆంగ్ల పదములు ఒక కొన్ని, పండితులును పామరులును సృష్టించిన కృతక ప్రామాణికములు (Hyperforms) వంటికొన్ని, తక్కినవి వ్రేళ్ళ మీదికి చాలని ధ్వన్యనుకరణములు." అని అధికారికంగా నిరూపించిన పరిశోధనా పరమేశ్వరులు దొణప్ప. హంగు, హత్తు, హరివాణము, హాయి, హుంటాహుంటి, హుళక్కి, హెచ్చు, హేమాహేమీలు, హొయలు, హోరాహోరి మొదలైనవి కన్నడ భాషనుంచి తెలుగులోకి ప్రవేశించాయి. హద్దు, హుకుం, హాజరు, హుజూరు, హోదా మొదలైనవి మరాఠీ నుంచి, పారసీనుంచి వచ్చినవి. హెడ్డు, హేడ్డు, హౌసు ఇంగ్లీషు నుంచి ప్రవేశించినవి. 'ఆరతి' పదమేసరైనది. 'హారతి' తర్వాత ఏర్పడింది. 'అడలు' అనేది 'హడలు'గా మారింది. కన్నడంలోని ఎచ్చఱికె తెలుగులో హెచ్చరిక అయింది. ఇవన్నీ కొంత మంది సృష్టించినవి కాబట్టి హారతి, హడలు హెచ్చరికలను దొణప్ప కృతక ప్రామాణికాలని పేర్కొన్నారు.

శ్రీనాథయుగంలోని కవులు కావ్యాలలో వాడిన అన్యదేశ్యాలను మూలాలతో, అర్థ వివరణతో, అర్థ పరిణామంతో సవివరంగా నిరూపించి దొణప్పగారు "శ్రీనాథయుగము - అన్యదేశ్యములు" అనే పెద్ద పరిశోధన వ్యాసం రచించారు. ఎవ్వరూ స్పృశించని (స్పృశించలేని) అంశాన్ని తలకెత్తుకొని కృతకృత్యులయ్యారు. ఇప్పటికీ అన్యదేశ్య విషయంలో దొణప్పగారి నిరూపణలే పరమ ప్రమాణాలుగా నిలిచాయి. "అన్యదేశ్యము దేశ్యముతో జేర్పబడినది గాన దానికి బ్రత్యేకముగా సంజ్ఞయిడబడదు"

అని శబ్దరత్నాకరకారుడు పేర్కొని, తన నియమాన్ని తానే అతిక్రమించాడని దొణప్ప సోదాహరణంగా నిరూపించారు. ఇంతటి సూక్ష్మపరిశీలన ఆయనకి అలవాటే! శ్రీనాథయుగంలోని నూట ఆరు అన్యదేశ్యాలను సేకరించి నిరూపణ చేసిన పద్ధతి భావిభాషా పరిశోధకులకు మార్గదర్శకం. కొన్ని పరిశీలించండి.

జరి: వెండి బంగారములు మొలాము. "జరిగొన్న వెలిపట్టు జన్నిదంబులనంగ" (క్రీడా. 42). "జరివోని గడితంపుజిఱుత చౌకంబుల" (హైడి. 134) "జరిగొన్న వెలిపట్టు జన్నిదంబుల తోడరత్నాల తారహారము ధరించి" (శివరా. 2–90). "వెన్నెల జరియిడ్డ వెండి తీగల బోలు యజ్ఞోపవీతంబులు" (విక్ర. 7–143).

పారసి : జర్, జరీన్=బంగారు, ధనము. జర్‌తార్=బంగారుపోగుతో చేయబడిన, వెండి, బంగారము మొదలగు వానితో మొలాముచేసిన నూలిపోగు, జర్(బంగారు) + తార్(దారము), జరబాడీ (ఱు) వర్ణవిభేదనము (dissimilation) కులక్ష్యము. జలతారీ (రు), జల్తా(రీ)రు తీని రూపాంతరములు. 'జలకము+తారు' అను శ.ర. వ్యుత్పత్తి అశాస్త్రీయము. తన్మూలమున నిరాకృతము. శ.ర. 'జరి'ని వైకృతమనుట నిరాధారము. వైకృత దీపికలో నీ పదము కానరాదు. ప్రాచీన 'పారసీకభాష – అవెస్తా – లోరెన్య' అనగా బంగారము. అవెస్తాకు సోదరభాషయగు సంస్కృతమునందలి 'హిరణ్య', పారసిలోని 'జరన్య'కు జ్ఞాతిపదము (cognate word) జరీ కుచ్చుల జీను, జరీకోక, జరీబుటా చీర – అన్నవి తెలుగున అర్వాచీన ప్రయోగములు, జలపోసనము.

మేకు: గూటము, చీల. ".........మేకులుగా మెఱయుచు....." (వరాహ. 6–84)

మరాఠీ. మేఖ=గుంజ, గూటము. మేకు, డేరాగూటము, నూది, గుల్‌మేఖ్=రోజా పూవును బోలిన బొడిపెగల మేకు, తెలుగున 'ఏకైవచ్చి మేకై కూర్చున్నాడు" అను పలుకుబడి అర్వాచీనము. దేశ్యమని బ్రౌణ్యము. పు804. అన్యదేశ్యమని మిశ్రబ్రౌణ్యము.పు. 98.

సేబాసు: మెచ్చికోలును తెలుపుమాట.".........సంగ్రామాంచలమునిదెనను మెచ్చించెదవేనపుడు నిన్ను సేబాసందున్" (హర. 7–64). (విక్ర. 8–66) మరాఠీ. శాబాస=ప్రశంసార్థకపదము.పారసి:షహ్–బాష్=స్తుతి. మేలుమేలని ఎలుగెత్తి కొనియాడుట.

దొణప్పగారి భాషా పరిజ్ఞానానికి, అన్వేషణ సామర్థ్యానికి "తెలుగులో బుడతకీచునుడులు" అనే పరిశోధనా వ్యాసం నిలువుటద్దం. పోర్చుగీసుకి బుడతకీచు అని దొణప్పగారి వ్యవహారం. పురతకీశు, బుడతకీను అని సాహిత్యంలో వాడారు. వాటికి వికృతగా ఈయన 'బుడతకీచు' వాడారు. పోర్చుగీసుకి మూలభాషాపదం "పొర్తగీజ్". అందుకని 'పోర్తుగాలు చరిత్ర'ని వివరించారు. పోర్చుగీసు వాళ్ల చరిత్రను దొణప్పగారిలా తెలుగులో వివరించిన దాఖలాలు లేవు. పోర్చుగీసు పదాలపై పూర్వం బ్రౌన్, దల్గాదు, గాలెటి, చిలుకూరి నారాయణరావు, గంటిజోగి సోమయాజి, కొత్తపల్లి వీరభద్రరావులు మాత్రమే కృషి చేశారని దొణప్ప స్మరించారు. ఈ పరిశోధన లక్షణం వీరి ప్రతి వ్యాసంలోనూ చూస్తాం. వాళ్ళు చేసిన కృషిని ప్రశంసిస్తూనే లోపాలను కూడా పేర్కొన్నారు. కొత్తపల్లి వీరభద్రరావు గారి విశేషకృషిని ప్రశంసించారు. తెలుగులో

మొత్తం నూటయాభై పోర్చుగీసు పదాలున్నాయని దొణప్ప సాక్ష్యాధారలతో నిరూపించారు. ఈ పదాలను సైనిక సంబంధాలు, నావికా పదాలు, క్రైస్తవ మత పదాలు, వాణిజ్య సంబంధాలు అనే విధంగా వింగడించారు. అనాస, అలమారు, ఇస్త్రీ, కుంపిణి, మేస్త్రీ, కమీజు, బొత్తాము, కోస్తా, బొప్పాయి, క్రీస్తు, తువ్వాలు, గమేళా, బొంబాయి (తోడుకొనే పనిముట్లు) మొదలైనవి పోర్చుగీసు పదాలని నిరూపించారు. అనాస, అన, ఇస్త్రిరి, ఏలము(వేలం), క్రీస్తు, చెవి(తాళం చెవి), తువాల మొదలైన పదాల పుట్టు పూర్వోత్తరాలను దొణప్ప వివరించిన విధం అనన్యసామాన్యంగా, సహేతుకంగా వుంటుంది. మనకి ఎన్నో కొత్త అంశాలు అవగతమవుతాయి. సాహిత్యంలో కూడా పోర్చుగీసు పదాలు ఎలా ప్రయోగించబడ్డాయో వివరించిన తీరు కూడా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. మనం నిత్యం వాడే కాజా, కుదేలు(పేకాటలోని మాట), గిడ్డంగి, బాతు(అముక్తమాల్యదలో వుంది), బాల్చీ, బిస్కతు, బొంగు, మేజా(బల్ల), వేలాం సబ్బు వంటి పదాలు పోర్చుగీసు నుంచి ఎలా వచ్చాయో తెలుసుకోవటానికి ఈ "బుడత కీచునుడులు" వ్యాసం తోడ్పడుతుంది. ఇదే విధంగా దొణప్పగారు మరాఠీ భాషలో గల తెలుగు నుడులపై విశేషమైన పరిశోధనచేసి దాదాపు యాభై తెలుగు పదాలున్నాయని నిరూపించారు. కృతకప్రామాణిక రూపాలపై తెలుగులో విస్తృతమైన కృషి చేసింది కూడా దొణప్పగారే. హకారాది పదాలను పూర్వం తెలుసుకొన్నాం. మరొక వ్యాసంలో ఈ కృతక ప్రమాణపదాలను మరింత విపులంగా ప్రకటించారు. త్రుళ్ళు, త్రెగు, త్రెంచు, త్రోము, ప్రక్క ప్రేల్చు, తేనియు, నూనియు, చేదస్తము, జెలగ, బుఱుజు, బాజాఱు, వఱకు, విడము, వెన్ను, వేట మొదలైనవన్నీ పండితులు సలక్షణమని భావించి కృతకంగా సృష్టించినవే అని కావ్య, లాక్షణిక ప్రయోగాలను ఉదాహరించి దొణప్ప నిర్ధారించారు.

"ఆకాశభారతి" అనే వ్యాససంపుటిలో కూడా భాషావ్యాసాలున్నాయి. తెలుగుపై పాశ్చాత్య భాషా ప్రభావం గురించి విశిష్టమైన రీతిలో వివరించారు. ధ్వని, అర్థ విపరిణామాలను తెలిపారు. 'ఆటంబాంబు'ని తెలుగులో 'అణ్వస్త్రం'గా వాడుతున్నాం. 'అస్త్ర' శబ్దానికి కొత్త అర్థం ఏర్పడింది. సిరంజికి 'సూది' అని కల్పించుకొని ఇంజక్షనుకి "సూదిమందు" అన్నాం. ఇసుకోలు, గళాసు, బూడ్సులు, ఓవరాయిల్ మొదలైన వాటినే కాక కళావరు, తురుపు మొదలైన పదాలను కూడా దొణప్ప విపులంగా చర్చించారు. "తెలుగు మాండలికాలు – విచిత్రాలు", "తెలుగులో అర్థవిపరిణామం", "తెలుగులో ప్రశంసార్థకాలు" మొదలైన వ్యాసాలు "భాషా చరిత్ర వ్యాసావళి"లోని వ్యాసాల మాదిరి సమగ్ర పరిశోధన వ్యాసాలుగా కనబడవు. ఎందుకంటే ఇవి ఆకాశవాణి వారి ప్రసారం కోసం ఉద్దేశించి రాయబడినవి.

ఆంధ్ర విశ్వవిద్యాలయం పక్షాన "తెలుగు వ్యుత్పత్తి పదకోశం" నిర్మాణం 1957లో ఆచార్య గంటిజోగి సోమయాజిగారి ముఖ్య సంపాదకత్వంలో ప్రారంభమైంది. అప్పటినుంచి 1976దాకా ఒక ప్రక్క తెలుగుశాఖలో అధ్యాపకునిగా వుంటూనే వ్యుత్పత్తి పదకోశంలో సంపాదకులుగా వ్యవహరించారు. ఈ నిఘంటు నిర్మాణం తొలిదశల్లో దొణప్పగారు చేసిన కృషి, చేయించిన కృషి సామాన్యం కాదు. (తర్వాత వచ్చిన సంపాదకులు

వీరి కృషిని విస్మరించటం – అనేది మనకి సామాన్యమైన విషయమే). దొణప్పగారి బహుముఖ పరిశోధనా ప్రతిభకి పట్టంకట్టే బృహత్ గ్రంథం "మే పేరేమిటి?". ఇది అముద్రితం. ఇంటి పేర్లు, మనుషుల పేర్లు ఎలా ఏర్పడ్డాయో వాటి కథాకమామిషూ గురించి మనం చెప్పలేనంత కృషి చేశారు. ఎన్నో సంవత్సరాలుగా చేసిన ఈ కృషి వెలుగు చూడవలసి వుంది.

చివరగా దొణప్పగారి శైలి గురించి ఒక మాట. దొణప్పగారు స్వతహాగా వ్యావహారిక భాషావాది. గిడుగు వారిని సమర్థిస్తారు. అయితే ఆయన పరిశోధన వ్యాసాలలో గ్రాంధికశైలి కనిపిస్తుంది. దొణప్ప తమ సిద్ధాంత వ్యాసాన్ని 1963–66 సంవత్సరాలలో రచించారు. అప్పటికి విశ్వవిద్యాలయాలలో సిద్ధాంత వ్యాసాలు వ్యావహారికంలో రాయవచ్చు అన్న నిబంధన లేదు. గ్రాంధికంలోనే రాయాలి. కాబట్టి గ్రాంధికంలోనే సిద్ధాంత గ్రంథం వుంది. అయితే 1966 తర్వాత రాసిన భాషా చారిత్రక వ్యాసాలను వ్యావహారికంలో రాయవచ్చు. కాని గ్రాంధికంలోనే రాశారు. కొన్ని వ్యాసాలు లాక్షణిక సంబంధమైనవి కావటం వల్ల, అప్పటి పండితుల్ని ఢీ కొనాలంటే గ్రాంధికమే సరైనదని భావించడం వల్ల, భాషా శాస్త్రవేత్తలకి పాండిత్యం లేదనే అపవాదులు రావటంవల్ల–బహుశా దొణప్పగారు గ్రాంధిక రచనకే మొగ్గు చూపి వుంటారు. అయితే 1972 తర్వాత మాత్రం వ్యావహారికంలోనే రచించారు. వ్యావహారికమైనా గ్రాంధిక వాసనలు తప్పవు. దొణప్పగారి రచనా పద్ధతి ఆకట్టుకొంటుంది. కొన్ని చోట్ల నిర్దిష్టంగా, కొన్నిచోట్ల నిందాపూర్వకంగా, మరికొన్నిచోట్ల విచిత్రంగా, ఇంకొన్నిచోట్ల హేళనగా–వినోదభరితంగా కూడా వుంటుందని ఈ కింది ఉదాహరణల వల్ల తెలునుకోవచ్చు.

"అర్వాక్కాలికత స్థాపితమగునేమోయని వారి ఆదుర్దా. స్వపక్ష స్థాపనాభి నివేశముతో శ్రీరెడ్డిగారు నన్నయ కృతిలో కూడ అన్యదేశ్యములు ప్రయుక్తములయినవని నిరూపింపయత్నించుట ఆకాశమున మూరలు వేయుట".

"ముందు ముద్రిత ప్రతుల ముచ్చట. వివిధములగు భారతి ముద్రణములయందును, తక్కిన ఆకరములయందును గల పాఠములు కాలక్రమానుగుణంగా యథాలబ్ధిగా నీదిగువ ప్రదర్శితము. విద్యాశ్రమతత్త్వవేత్తలగు పెద్దలు ఈ క్రింది పాఠముల సరళిని పరికింపవేడికోలు".

"ప్రాచీన తమిళమున దీని వ్యాప్తి ఇంచుమించు అజాగళస్తనము వంటిది"

"శ్రీ అయిగ్రీవాయనమః శ్రీశారదాంబాయనమః–అనునిట్టి స్థాయిలలో గల లేఖకాధములు కల్పించిన అవ్యక్తపాఠములు. పర్యాప్తమయిన ఈ పరిశీలనము వలన 'గాడిదలను' అనుపాఠము కర్త్రభిప్రేతమనుట సయుక్తికము, సత్యమూలకము".

"పెక్కు లక్ష్యములు బహువారములు సావధానముగా పరిశీలించిన చిన్నయసూరి వంటి లాక్షణిక చక్రవర్తియే యీ భ్రాంతిలో పడగా తక్కిన వారిని గూర్చి తడవనక్కఱలేదు".

"హకారాది పదములు వెరసి ఇన్ని పద్దుల క్రింద చెల్లు పడగా
మనసొంతమునకు మిగిలినది హళ్ళికిహళ్ళి, సున్నకు సున్న".

ఆచార్యదొణప్ప అచుంబిత అంశాలపైననే పరిశోధనకి ఇష్టపడేవారు. అనుచిత విమర్శ వారికి తెలియని విద్య. కృతజ్ఞతాబుద్ధి, వినయం వల్ల పరిశోధనలో అగ్రగణ్యులయ్యారు. సాహిత్యపరనం, భాషాశాస్త్ర అధ్యయనం రెండూ సమపాళ్ళలో గల ఉత్తమోత్తమ పరిశోధకుడాయన.

**3) తెలుగు హరికథాసర్వస్వం**

ఒక ప్రభుత్వం, ఒక విశ్వవిద్యాలయం, ఒక అకాడమి చేయవలసినంత పని ఒక్క చేతిమీదుగా చేసి చూపించారు శ్రీదొణప్పగారు" అని కళాప్రపూర్ణ పురిపండా అప్పలస్వామి గారు ప్రస్తుతించారు. "తెలుగు హరికథాసర్వస్వం" అనేది తెలుగు సాహిత్యంలో అచుంబితమైన అంశం. ఎంతో ప్రాచుర్యంగల హరికథావాఙ్మయంపై ఎవరి కన్నూపడలేదు. దొణప్పగారి చలువవల్ల హరికథావాఙ్మయానికీ, హరికథకులకీ సాహిత్య చరిత్రలో సుస్థిరస్థానం లభించింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతితోపాటు ఈ పరిశోధనవల్ల దొణప్పగారు ఆంధ్రవిశ్వవిద్యాలయం నుంచి డి.లిట్ పురస్కారం కూడా పొందారు.

కన్నడనాడు, మరాట్వాడా, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ప్రాంతాలలో ప్రచుర ప్రచారంలోని హరికథా స్వరూప స్వభావాల ప్రయోగాల వివరణలు, హరికథావాఙ్మయచరిత్ర, సంగీత విశేషాలు, భాషాదిక విశేషాలు, కథాగాయనుల జీవిత రేఖలు, ముద్రితాముద్రిత హరికథారచనా-ప్రవచనాల పరమైన ఒక విజ్ఞాన సర్వస్వమిది-అన్నది మేధావులమాట!

సామగ్రి సంకలనంలో దొణప్పగారు శాస్త్రీయతకి, సత్యనిరూపణకీ ప్రాముఖ్యం ఇస్తారు. ప్రశ్నావళిని రూపొందించటం, కళాకారుల్ని కలిసి విషయాన్ని సేకరించటం, ఛాయాచిత్రాలు తీయటం, సమాచారం తెలిపిన వారి వివరాలు, ఆకరగ్రంథాలు..... తెలపటం....ఇదీ నిర్దిష్ట ప్రణాళిక. హరికథా సర్వస్వంలోని విశేషాలివి-

మొత్తం హరికధా కళాకారులు - 1018

వీరిలో స్త్రీలు - 168

తెలుగులో కథాప్రవచనం చేసిన కన్నడిగులు - 38

దొణప్పగారు పరిశీలించిన ముద్రితాముద్రిత గ్రంథాలు - సుమారు 400.

ఆచార్య ఆర్. శంకరనారాయణ రాజుగారు తెలుగు హరికథా సర్వస్వం పై విమర్శనాత్మక వ్యాసం రాస్తూ తెలిపిన విశేషాలు:

- ఈ గ్రంథంలో వస్తు వివేచనం ఒక ఎత్తు, గద్య రచనా వైశద్యం ఒక ఎత్తు, భాషమీదా, పదపరికరం మీదా వీరికున్న అధికారం, వీరి వచనరచనా విన్యాసం అప్రతిమానం.
- దృశ్య కావ్యాలలోని సూత్రధారునకు పౌరాణికుడే మూలం కావచ్చునన్న నిశ్చితానిశ్చితాభిప్రాయాన్ని భారతీయ నాటక రంగ చరిత్రకారాలు ప్రకటించారు. ఈ గ్రంథ కర్త సూత్రధారునకే కాక హరి కథకునకూ, బుర్రకథలోని ముఖ్య గాయకునకూ, భామాకలాపంలో సత్యభామాధవుడైన మాధవునకూ పౌరాణికుడే మూలమని సునిశ్చితంగా తేల్చి చెప్పారు.

– యక్షగాన కళారూపానికి పరిణత రూపమే హరికథ – అనేవాదాన్ని పరాస్తం చేస్తూ హరికథ యక్షగానానికి పూర్వరూపమని, ప్రమాణాలు ప్రదర్శిస్తూ నిర్ణయం చేశారు.

**4) జానపద కళాసంపద**

దొణప్పగారు ఎంతటి విద్వాంసులైనా, విశ్వవిద్యాలయ ఆచార్యులైనా మూలాలనూ, సంస్కృతినీ ఎప్పుడూ మర్చిపోలేదు. జానపదసాహిత్యాన్ని ఎంతో సేకరించారు. ముఖ్యంగా రాయలసీయ జానపద గేయాలను వెలుగులోకి తెచ్చారు. ఎన్నో వ్యాసాలు రాశారు. జానపద సాహిత్యం పై రాసిన వ్యాసాలన్నిటిని "జానపద కళాసంపద"గా ప్రచురించారు.

"ఆచార్య తూమాటి దొణప్పగారు సమకూర్చిన ఈ జానపద కళాసంపద తెలుగు వారంతా రెండు చేతులా స్వాగతింపవలసిన అపభ్రంశ కళాసంహిత" అన్నదెవరోకాదు– నిష్పక్షపాత, నిర్భయ విమర్శకులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. జానపద సాహిత్యం లోని యక్షగానాలు, రాయసీమ రామాయణ గేయాలు, మెరవణి గద్య, కలుపు పాటలు, మొహరం గీతికలు, విసరురాతి పాటలు, జట్టి జేయుపాటలు.... వంటి భిన్న ప్రక్రియల తీరు తెన్నులనూ, అందచందాలనూ వివరించే అణిముత్యాలాంటి ఎనిమిది వ్యాసాల సంకలనం ఇది. దీనికికూడా ఆంధ్రప్రదేశ్ సాహిత్యం అకాడమీ వారి బహుమతి లభించింది.

గుత్తి చంద్రశేఖరరెడ్డిగారు ఈ పుస్తకం పై మంచివ్యాసం రాసి దొణప్పగారి కృషీవలత్వాన్ని వెల్లడించారు. వస్తు సాన్నిహిత్యం, ప్రామాణికత, స్పష్టత, సౌజన్యత, పరిరంజకత – అనే గుణాలు వీరి వ్యాసాలలో ఉంటాయని చెప్తూ చంద్రశేఖరరెడ్డిగారు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది.

"ఇంత మంచి సాహిత్యంగాలిలో ధూళిలో కలసిపోకుండా కష్టపడిసేకరించి, ఆపాడిన వారి బాణీనీ, యాసనీ అలాగే తన గానంలో నిలుపుకొని, పాడే వేళ తానొకనిజమైన జానపదుడై దొణప్పగారు మనకందించిన జానపదకళాసంపదకు మనం ఎంత ఋణపడివున్నామో. రాయసీమమాండలికంలో యింతసౌందర్య ముందా అన్పిస్తుంది వీరి శైలిని చూస్తుంటే. అసలు జానపదసాహిత్యాన్ని ఏఏ సందర్భాల్లో ఏమేమి పాడతారో అవిధంగా విడతీసి, ఆపాడే తతంగాన్ని కూలంకషంగా, లోతుగా తెలిపిన తీరు, మనము మరచి పోతున్న వెనుకటి తరాల సాంస్కృతిక జీవనాన్ని కళ్ళెదుట కట్టినిలిపింది".

**5) తెలుగులో కొత్త వెలుగులు**

ఇది భాషా సాహిత్యాంశాలకు సంబంధించిన ఇరవై వ్యాసాల సంకలనం. ఆకాశవాణిలో చేసిన ప్రసంగవ్యాసాలివి. ఇందులో గల భాషా సంబంధి వ్యాసాలు గురించి ఇంతకుముందు వివరించాను. "ఈ యిరవైయింటినీ ఎంతో విమర్శనాదక్షతతో వివరించి నిగ్గుతేల్చి మన ముందుంచారు గ్రంథకర్త. అందువల్లనే ఈ గ్రంథమంతా విషయ పుష్కలంగా, రచనా సౌష్ఠవంగా, సార్థకపద ప్రయోగపూర్ణంగా సాగింది" అని డాక్టర్ అంతటి నరసింహంగారు ఉన్నమాట చెప్పారు.

'అణాకథ' చాలా ఆసక్తికరంగా వుంటుంది. చాటు పద్యాలను ఉదాహరిస్తూ ఎన్నో కొత్త అంశాలను తెలియజెప్పారు. "తెలుగు సాహిత్యంలో హాస్యం" పై పూర్వం

ముట్నూరి సంగమేశంగారు ఒక పుస్తకమే రాశారు. దొణప్పగారు తమ పరిశోధనా దృష్టితో హాస్యంపై మరిన్ని విషయాలు వెల్లడించారు. వాక్చాతుర్యం, అక్షేపం, ప్రత్యాక్షేపం, ఉపాలంభం వ్యంగ్యం మొదలైన భేదాలతో కవిత్వం, నాటకాలలో గల హాస్య చతురతనీ తెలిపారు. రంగనాథరామాయణ వైశిష్ట్యాన్ని ఒక వ్యాసంలో వివేచించారు. "తెలుగులో తిట్టు కవితలు" అనే వ్యాసంలో కవుల పరిహాసాలనూ, ఈసడింపులనూ, మూలమూలలగల సమాచారం గమనిస్తాం. దొణప్పగారి విశిష్టమైన "చూపు"కి నిదర్శనం "ప్రాచీనసాహిత్యంలో పశుపక్ష్యాదుల పాత్ర చిత్రణ". రామాయణకాలం నుంచీ పశుపక్ష్యాదులు సాహిత్యంలో ప్రముఖపాత్ర వహించిన విధానాన్ని వివరించిన తీరు ఆశ్చర్యపరుస్తుంది. ఇంత విషయ సేకరణకి ఎంత శ్రమపడ్డారో అనిపిస్తుంది. పింగళి సూరన నుంచి బోయి భీమన్న వరకు ఎంతమంది ఏఏ అనేకార్థకకావ్యాలు రాశారో "లోనారసి" రాసిన వ్యాసం "తెలుగులో అనేకార్థక కావ్యాలు". ఈ వ్యాసం ఎందరో పరిశోధకులకు మార్గదర్శకమైంది. భాషా సంబంధిత వ్యాసాలు ఇందులో ఎనిమిది ఉన్నాయి. వాటిలో మాండలిక పదాలను గురించిన వ్యాసం. తెలుగు మాటల పుట్టుపూర్వోత్తరాలు తెలిపే వ్యాసం దొణప్పగారి పరిశోధనా తత్పరతకి చిహ్నాంగా నిలుస్తాయి. ఈ వ్యాస సంపుటిలో దొణప్పగారి భిన్నమైన రచనా శిల్పం చూస్తాం. చెప్పే పద్ధతిలో అందం - చందం, చెణుకులూ, తెలుసుకోవడానికి "తెలుగులో కొత్త వెలుగులు" ఒక మచ్చుతునక. గ్రంథనామం అక్షరాలా సార్థకం.

**6) ఆకాశభారతి**

"ఈ ప్రసంగాలలో చాల వాటికి ప్రేరకులు, చోదకులు ఆకాశవాణి అధిపతులు. వారి సౌజన్యానికి అభివాదాలు..... ఈ ప్రసంగాలు ఒకనాటివీ, ఒక ఏటివీ కావు, సుమారు పాతికేళ్ళనాటి నుంచీ మూర్తి కట్టినవి" అన్నారు ముందుమాటలో. ఇందులో ఇరవై అయిదు వ్యాసాలున్నాయి. ఇందులోకూడా "సమ్మనగం" భాషా విజ్ఞాన పరమైనవే.

"శిష్టసాహిత్యంలో జానపదముద్ర"లో ఎవరూ చెప్పని కొత్త కొత్త అంశాలున్నాయి. "మడికట్టుకున్నలాక్షణికులు ఎంత నెత్తిన నోరు పెట్టుకొని గోల చేసినప్పటికీ జనపదాలలో పుట్టి పెరిగిన కవులూ, జానపదాల మధురమయ భణితి పై మోజు పెంచుకుని ఆ బాణిలో తమ వాణిని కైసేసిన కవులూ అనేక మాండలిక పదాలకూ, ప్రయోగ ఫక్కికలకూ తమ రచనలలో స్థానం కల్పించారు." అన్నది దొణప్పగారి సత్యప్రతిపాదన. ఇప్పటికి కూడా మన విమర్శకులూ, పరిశోధకులూ స్పృశించని "పురాణ ప్రవచనం" గురించి దొణప్పగారు రాసిన వ్యాసం ఈ పుస్తకానికి విశేషతను చేకూర్చి పెట్టింది. కొత్త సంగతులను తవ్విపోసిన అపూర్వమైన వ్యాసం ఇది. ఈ అంశంపై పెద్ద పుస్తకం రాద్దామనుకొన్న వీరి ప్రణాళిక నెరవేరక పోవటం మన సాహిత్యానికి పెద్ద లోటు.

దొణప్పగారి పరిశోధనా తపనకీ, లోకానుశీలనకీ, సహేతుక విశ్లేషణకీ ఇంటి పేర్లపై రాసిన నాలుగు వ్యాసాలు దృష్టాంతాలు అప్పుడప్పుడే భాషా శాస్త్రంలో "నామవిజ్ఞానం" అనే విభాగం ప్రాచుర్యంలోకి వస్తుంది. దొణప్పగారు గృహనామాలు, వ్యక్తినామాలు, స్థల నామాలూ, మారు పేర్లూ..... వంటి వాటిని గురించి గుట్టలుగా సమాచారం సేకరించారు. శిష్యుల ద్వారా, అభిమానుల ద్వారా ప్రతి జిల్లా నుంచీ విషయ సేకరణ చేశారు. ఇది "మీ పేరేమిటి" అనే బృహత్ గ్రంథం కోసం పడిన శ్రమ. ఇందులోని ఈ వ్యాసాలను గమనిస్తే ఎవరైనా అబ్బురపడవలసిందే. "తెలుగులో ప్రశంసార్థకాలు", "తెలుగులో స్మృతి కావ్యాలు", వంటి విలక్షణ వ్యాసాలు తెలుగు సాహిత్యంపై ఎంతో పరిశోధన చేయవలసిన అవశ్యకతను వెల్లడిస్తాయి. మహాత్మాగాంధీ కంటె ముందే సంఘ సంస్కరణకి కృషి చేసిన నారాయణ గురు దేవులును ఒక వ్యాసంలో పరిచయం చేశారు. నాగార్జున విశ్వవిద్యాలయంలో జరిగిన పరిశోధనా కృషినీ, తెలుగు విశ్వవిద్యాలయం లక్ష్యాలనూ - చేపట్టిన కార్య క్రమాలనూ వివరించే వ్యాసాలూ ఉన్నాయి. నేటితరం అవశ్యం పఠించదగిన వ్యాసరాజములివి!



# అనుబంధం - I

## 'హరికథాస్వరస్వం' గ్రంథానికి పురిపండా పీఠిక

*'కళాప్రపూర్ణ' పురిపుండా అప్పలస్వామి*
*ఆం.ప్ర.సాహిత్య అకాదమీ ఉపాధ్యక్షులు*

'తెలుగు హరికథా సర్వస్వం కడముట్టా వెన్నాక ఇంత మంచి పుస్తకం ఈ దరిమిలా చేతికి రాలేదు' అనిపించింది. అనిపించడమే కాదు నిజం కూడా అంతే. ఆచార్య తూమాటి దొణప్పగారి చేతిచలవ ఇది.

శాస్త్రాలు బట్టీపెట్టి పండితులమంటారు కొందరు. మెదడు కదపరు, కదిపినా అది కదలదు. అయినా 'ఆచార్యులే' వారు. శ్రీ దొణప్పగారు ఆ కోవకు చెందినవారు కారు.

పదికాలాలు నిలిచే ప్రామాణికమైన గ్రంథరచన చెయ్యాలంటే సర్వతోముఖమైన పాండిత్యం కావాలి. నవనవోన్మేషమైన ప్రతిభ కావాలి. పరిశోధనలో పాటవమూ, సత్యాన్వేషణలో తత్పరతా, పరిశ్రమలో ఉత్సాహమూ, నిజాయితీతో కూడిన అవగాహనా, ప్రగతిదృక్పథమూ, పక్షపాతంలేని తీర్పూ కావాలి. ఇదిగో యిన్నీ మూర్తీభవించిన ఆచార్యులు డా. దొణప్పగారు.

పండగలనకా, పబ్బాలనకా పల్లెల్లోనూ పట్టణాలలోనూ ఎడతెరిపి లేకుండా వొకవంక కాలక్షేపాలు జరుగుతూనే వున్నాయి; కొత్తకథలు ఇంతో అంతో వుడుతూనే వున్నాయి. కొత్తదాసులు గజ్జకడుతూనే వున్నారు తరిబీదలయి. పాఠశాలలూ, సమ్మేళనాలూ సాగుతూనే వున్నాయి. అయినా సమగ్రమైన, సాధికారికమైన హరికథా వాఙ్మయ చరిత్రకాని, హరిదాసుల జీవిత చరిత్ర కాని ఇంత వరకు తెలుగులో వెలువడిన పాపాన పోలేదు. ఈ నాటికి 'హరికథా సర్వస్వం' రాసి ఆ పెద్దలోటును తీర్చిన శ్రీ దొణప్పగారు ఎంతైనా అభినందనీయులు.

తెలుగులోనేకాదు, ఏ ప్రాంతీయ భాషలోనూ హరికథగురించి ఇంత ప్రామాణికమైన రచన వెలువడలేదు. దీనికని ప్రొఫెసర్ దొణప్పగారు పడిన పరిశ్రమా, జరిపిన పరిశోధనా బేరీజు వేసి చూపడం తరంకాని పని. ఎన్నో అన్ని హరికథలు సంపాదించారు: పరిశీలించారు. ఎన్నో వూళ్ళు తిరిగారు, ఎన్నో విషయాలు సంగ్రహించారు. ఎంతో అంతమంది హరిదాసుల్ని సందర్శించారు; సంప్రదించారు. ఎందరెందరితోనో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపారు. ఇరుగు పొరుగు సీమలు పర్యటించి వివరాలు సేకరించారు; వింగడించారు. మరుపు మడతలలో మురిగి పోయిన ఎన్నో అన్ని హరికథలు అచ్చువీ అచ్చుకానివీ వెదకి తీశారు. ఎందరినో హరిదాసుల్ని తనువుకి తెచ్చారు. ఒక ప్రభుత్వం, వొక విశ్వ విద్యాలయం, వొక అకాదమి చేయవలసినంతపని వొక్క చేతిమీదుగా చేసి చూపించారు శ్రీ దొణప్పగారు.

గ్రంథంలో ఏ భాగం చూసినా వీరి నిశితమైన ప్రతిభ కొట్టవచ్చినట్టు కనపడుతుంది. హరికథల పుట్టుపూర్వోత్తరాలూ, వాటి వాటి ప్రాచీనతా చూపడానికి డా. దొణప్పగారు చేసిన కృషిని వైదిక గ్రంథాలనించీ, వివిధమైన శాస్త్రగ్రంథాలనించీ, అధునికుల రచనల నించీ, వారిచ్చిన ఉద్ధరణలే నిరూపిస్తున్నాయి.

హరికథకు ముఖ్యాంగాలయిన సంగీత సాహిత్యాలనూ, వాద్యాలనూ, భాషా విశేషాలనూ కూలంకషంగా చర్చించారు రచయిత. హరిదాసుల లక్షణాలు వివరించారు.

హరికథా పితామహులయిన నారాయణదాసుగారిని హరికథా వాఙ్మయంలో యుగకర్తగా తెలుపుతూ, నారాయణదాసు ముందు యుగం, నారాయణ దాసు యుగం, నారాయణ దాసు తరవాతి యుగం అని దొణప్పగారు చేసిన యుగవిభజన సమంజసం గానూ, సమర్థనీయంగానూ వుంది. అలాగే అచ్చతెలుగు ముచ్చటలో వా రన్న మాటలు అచ్చంగా అందరూ అంగీకరించదగినవి. నిజంగా అచ్చతెలుగూ, వీర గ్రాంధికమూ నిరర్థకమైనవి.

పౌరాణిక కథలు తీసుకుని హరికథా రచయితలు అనేకులు చేసిన మార్పులు చేర్పులు చక్కగా వివరించారు ఆచార్యులు. ఇవి నూటికి తొంభై పాళ్ళు పాత పల్లెపాటలతోనే హరికథా రచయితలకంటే పేరైనా తెలియని పాతపాటల కవులు కల్పనలో గొప్పవారు. 'ఇంద్ర సూర్యులు అహల్యతో క్రీడించడం' కథకి మూలం విచిత్ర రామాయణం. ఇది ఒడియానించి డింకాడ గోపీనాథకవి తెలిగించింది.

'జానపదులు (పల్లె జనం) అన్న మాటను నేడు ప్రాచీనమైన పరిమితార్థంలో కాక అధునికమైన విపులార్థంలో స్వీకరించవలసివుంది' అన్న ఆచార్యుల నిర్దేశం నిర్వివాద మయింది. హరికథ జానపద కళాసంపదలోదే అని మనం ఊహిస్తున్నా అది అచ్చమైన పల్లె ప్రక్రియలలో చేరదు. పల్లెప్రక్రియలకు ప్రజల వాడుక భాష ప్రాణం. హరికథలలో ఇంచుమించు అది మృగ్యం, కథకుడి వ్యాఖ్యానంలో తప్ప. మార్గ, దేశి – ఈ రెంటిలో ఇది దేశి తెగకే చెందుతుంది. అయినా నారాయణదాసు వంటి విద్వత్కవుల ప్రాపకంతో మార్గవేపు మొగ్గుచూపడం కూడా కద్దు.

గ్రంథం చివర గ్రంథకర్త హరికథకుల, కథాగాయనుల జీవిత చరిత్రలు చేర్చి తెలుగు వారికి మహోపకారం చేశారు. ఇన్నింటితో ఈ గ్రంథానికి, 'తెలుగు హరికథా సర్వస్వం' అన్న పేరు అక్షరాలా సార్థక మవుతున్నది.

విశాఖపట్నం
1-11-78

పురిపండా అప్పలస్వామి



# అనుబంధం - II

## చేరా ఏమంటారు?

దొణప్పగారు పరమశివుడిలా భక్తసులభుడు. పోనీ శిష్యసులభుడు అందాం! భక్త సులభత్వం పరమ శివుణ్ణి చిక్కులు పెట్టినట్టుగానే శిష్యసులభత్వం దొణప్పగారిని ఇబ్బందుల్లో పడేసిందనుకుంటాను. ఆయన తీరిక సమయాలు కుటుంబానికీ, పరిశోధనకు మాత్రమే వెచ్చించారు. దొణప్పగారు కాఫీ తాగరు, వక్కపొడి వేసుకోరు. ధూమం, ద్రవం సంగతి చెప్పనక్కర లేదు. హోటలు బంజారాకి తీసుకెళ్లి ఏం తీసుకుంటారని అడిగితే పెరుగన్నం అని నిస్సంకోచంగా చెప్పగలరు (ఇది 1989లో నిజంగా జరిగింది). దొణప్పగారు నిగర్వి, సరళజీవి. ఆయన్ను ఎక్కువ కాలం వేధించిన సమస్యలేమీ లేవనుకుంటాను. పరిశోధన సమస్యలే ఆయన వ్యక్తిగత సమస్యలు. నిరంతరం అవే ఆలోచనలు.

దొణప్పగారి పాండిత్యం చాలా గొప్పది. పరిశోధన ఆయన పేరు, పరిశ్రమ చిరునామా ఏ పరిశోధన చేసినా ఆసమయానికి సంబంధించిన సమాచారాన్ని అన్ని వైపులనుంచి సేకరిస్తారు. ఏ ఒక్క సోర్సు వదిలిపెట్టరు. సమాచార సమగ్రత వీరినుంచి భావి పరిశోధకులు నేర్చుకోవలసిన ఒక సుగుణం. ఇవాళ చాలామంది ఒక అంశానికి ఒక విషయానికి పరిమితమై ఉండటం చూస్తున్నాం. ఆయన అలాకాదు. అన్ని రంగాలకు అంశాలకు సంబంధించి తలస్పర్శిగా పరిజ్ఞానం గలవారు. ప్రాచీన కావ్యాలు, వ్యాకరణాలు, నిఘంటువులు, భాషా శాస్త్రం, ప్రాకృతం... ఇలా అన్నీ క్షుణ్ణంగా తెలిసినవారు.

చాలమందికి తెలీని విషయం ఆయన మంచి కవిత్వం రాశారు. మంచి పద్యకావ్యం రాశారు. రామబ్రహ్మంగారూ నేను చదివాం. అచ్చు కాలేదు.

వ్యవసాయ వృత్తి పదకోశానికి దొణప్పగారు సంపాదకులుగా ఉన్నప్పుడు ఖమ్మం జిల్లా (నేను పుట్టిన ప్రాంతం) నుంచి కొన్ని పదాలు సేకరించమన్నారు. నేను పంపిన పదాలలో “రోద” అనే పదం వుంది. బండిచక్రం అని అర్థం. దొణప్పగారు ఈ పదం పోర్చుగీసుపదం అంటూ సంతోషించి నన్ను ఫీల్డ్‌వర్కర్‌గా చేర్చుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వ్యావహారిక భాష అమలుకై ఒక కమిటీ వేసింది. దొణప్పగారు నా పేరును సభ్యుడుగా సూచించారు. కానీ అప్పటి వైస్ ఛాన్సలర్ బుల్లయ్యగారు నా పేరు తొలగించారు. అప్పుడు దొణప్పగారు అబ్బూరి రామకృష్ణరావుగారి దగ్గరికి వెళ్ళి ఆయన చేత బుల్లయ్యగార్కి చెప్పించి కమిటీలో నన్ను సభ్యుడ్ని చేశారు. ఒక చారిత్రకమైన కమిటిలో నేనుండటం దొణప్పగారి వల్లనే సాధ్యమైంది.

దొణప్పగారు నా అభివృద్ధికోసం ఎన్నో రకాలుగా ఆలోచించి ప్రోత్సహించారు. నాకు ఉద్యోగం ఇప్పించలేదు. ఎం.ఏలో ఆచార్య ఎస్.వి. జోగారావుగారు తన విద్యార్థికీ

యూనివర్సిటీ ఫస్టురావాలని ఒక విద్యార్థిని బాగా చదివించేవారు. దొణప్పగారు నన్ను యూనివర్సిటీ ఫస్టు చేయ్యాలని చాలా శ్రద్ధ కనబరచి పర్యవేక్షించి ప్రోత్సహించారు. అయితే మా ఇద్దరికీ ఫస్ట్ రాలేదు. ఎం.ఏలో చేరినప్పుడు భద్రిరాజుగారు అమెరికా వెళ్తే దొణప్పగారు నన్ను కంటికి రెప్పలా చూసుకొన్నారు. నా విజ్ఞానం మీద ఆయనకి బాగా నమ్మకం వుండేది. ఈ నమ్మకం చివరివరకూ వుంది. అధికార భాషా సంఘం అధ్యక్షులు అయినప్పుడు కూడా నన్ను సభ్యుణ్ణిగా నియమించారు. ఒక పరిశోధక విద్యార్థికి పర్యవేక్షకుడు పనులప్పజెప్పినంత హడావిడి చేశారు. తెలుగు విశ్వవిద్యాలయం పదవీ ఆయన నెత్తిపై ముళ్ళ కిరీటం అయింది. ఉన్నతస్థానాల కోసం అంగలార్చే స్వప్రయోజన పరులు ముందుగానే ఉన్నతా సనాల్లో ఆసీనులై ఉన్నారు. విశ్వవిద్యాలయ నిర్మాణంలో ఇంకా ఉన్నతాసనాల కోసం ఆయన్ను వత్తిడి పెట్టారు. కఠినంగా మాట్లాడలేని ఆయన సరళ స్వభావాన్ని హాయిగా వాడుకున్నారు. దొణప్పగారికి తీరిక సమయల్లో ఎక్కువగా గడిపే మిత్రులున్నట్టులేదు. దొణప్పగారి జీవిత సహచరి గోవిందమ్మగారు ఆయనకున్న ఏకైక స్నేహితురాలు.

సమగ్రత (థరోనెస్) అనే దాన్ని ఆయన దగ్గర్నుంచి అందరం, మరీ ముఖ్యంగా తెలుగువాళ్ళు నేర్చుకోవలసిందెంతో ఉంది. దొణప్పగారిని గురుభావంతో గౌరవిస్తున్నప్పటికీ ఆయనెప్పుడూ నన్ను శిష్యుడిగా చూడలేదు. తనతో సమానంగా ఆదరించే వారు. ఆయన ఇచ్చిన ప్రోత్సాహం నన్ను మానసికంగా శక్తివంతుడ్ని చేసింది.

– చేకూరి రామారావు



# అనుబంధం - III

## బేతవోలు రామబ్రహ్మం గారి
## సిద్ధాంత వ్యాసానికి దోణప్పగారి పీఠిక

శాస్త్రజ్ఞానరాశి అనంతం. అది రాగద్వేషాలకు అతీతం. అందునా విశ్వ శ్రేయస్సాధనమైన సత్యారాధనం సకల గురుకుల మతం. అధునా, 'సత్యే సర్వం ప్రతిష్ఠిత'మ్మన్నది మా గోత్రవ్రతం. 'తెలుగు వ్యాకరణాలపై సంస్కృతప్రాకృత వ్యాకరణాల ప్రభావం' అన్న ప్రకృతరచన మా వ్రతానికి అనురూపంగా అవతరించి వెలుగును చూస్తున్నది. ఏతత్కర్త డాక్టరు బేతవోలు రామబ్రహ్మం విశేషదర్శనం, వివేకపరిపాకంగల ఉత్తమ పరిశోధకుడు. శాస్త్ర శిక్షా, వృద్ధోపాసనా ఇతనికి వజ్రకవచాలు. నిరంతరసాధనా, ప్రవచనాభ్యాసమూ వీటికి తోడు. వర్ణమాల, పరుష సరళాలు, ప్రత్యాహారపద్ధతి, ద్రుతమూ - ద్రుతప్రకృతికమూ, సంధి, రూపసాధన సరళి, ఉత్త్వదుజ్ఞులు, ప్రకీర్ణ విషయావళి - అన్న ఎనిమిది అధ్యాయాలలో విస్తరించిన ఈ సిద్ధాంతవ్యాసం అధ్యాయ సంఖ్యనుబట్టి లక్షణ శిరోభూషణమైన పాణిని అష్టాధ్యాయిని స్మృతిపథానికి తెస్తుంది. ఈ సంఖ్యానియమం ఐచ్ఛికం కావచ్చు యాదృచ్ఛికం కావచ్చు; ఏదైనా అష్టాధ్యాయియెడల ఈతనికిగల సమర్చనాబుద్ధి ఇందువల్ల స్పష్టమవుతున్నది.

సమీపవర్తిత్వం వల్ల గానీ, మత రాజకీయాది సంబంధాలవల్ల గానీ భాషలకు సంసర్గం ఏర్పడినప్పుడు అన్యోన్యం అటూ యిటూ ఆదాన ప్రదానాలు ప్రవర్తిల్లడం సహజం. కొన్నిపట్ల అది పద వినిమయంతో ఆగదు. ప్రదాతృ భాషలోని కావ్యాలకూ, శాస్త్రాలకూ ప్రతి గ్రహీతృభాషతో అనుకరణలూ, అనుసరణలూ రూపొందడం తప్పనిసరి. సంస్కృత ప్రాకృత భాషలతోడి ప్రగాఢ సంసర్గ సంబంధాలవల్ల తెలుగున అలాటి ప్రభావమే కనిపిస్తుంది. తెలుగుపై తత్సమ తద్భవ రూపాన ఈ భాషల ప్రభావం అతివేలంగా పడడమేగాక అక్కడి రచనలూ, రచనా సంప్రదాయాలూ ఇబ్బడిగా ముబ్బడిగా తెలుగున దిగుమతి అయ్యాయి. వీటిలో వ్యాకరణ రచనా ప్రణాళిక ఒకటి.

సంస్కృతం ఆద్యప్రకృతి అనీ, ప్రాకృతం ద్వితీయ ప్రకృతి అనీ, తెలుగు వికృతి అనీ లాక్షణికుల వ్యవహారం. తెలుగున గల తత్సమ తద్భవ రూపవిభాగాన్ని దృష్టిపెట్టుకుని యోచిస్తే తెలుగు వికృతి అన్న వాడుక సమంజసమే అనిపిస్తుంది. ఈ విభాగానికి చెందని దేశ్యభాగాన్ని వికృతి అనడం యుక్తిసహం కాకపోయినా, తెలుగులో ఏకదేశమైన తత్సమతద్భవ భాగానికి వర్తిస్తున్న వికృతి అన్న వ్యవహారం శేషభాగమైన దేశ్యానికిసైతం విస్తరించింది. వ్యుత్పత్తిపరంగా పృథగ్జన్యత్వంవల్ల

ఉభయప్రకృతి విలక్షణత్వమూ, ప్రవృత్తిపరంగా ప్రకృతి ద్వయ సంబంధంవల్ల తదుభయానుసారిత్వమూ తెలుగుభాషా విశిష్టత. ఇది ఆర్యభాషాజన్యం కాదనీ, ద్రావిడ భాషా మూలకమనీ అధునికులు అనువర్తించడమే కాదు, ప్రాచీనాంధ్ర శాబ్దికులు కేతనాదులు సైతం ప్రసంగించిన అంశమే. 'తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును - దానివలనఁ గొంత కానఁబడియె - కింత తాన కలిగె నంతయునేకమై - తెనుఁగు బాసనాఁగ వినుతికెక్కె' అన్న కేతన్న తీర్పులో వ్యుత్పత్తిపరంగా తెలుగునకు గల స్వతంత్ర ప్రతిపత్తి స్పష్టంగా స్థాపించబడింది. 'కేవలతయా అనుసర్పత్యుభే చ.....' అన్న చింతామణి హృదయం సైతం భూషణకారుడు శిల్పించిన తీరు తెన్నులను భూషించింది.

అయితే, తత్సమ తద్భవాలకు గల సమీప ప్రకృతులను నిర్ధారించే పక్షంలో తెలుగు లాక్షణికులలో ప్రధానంగా మతభేదాలు రెండు కనిపిస్తాయి. ద్వితీయ ప్రకృతిగా పరిభాషించబడుతున్న ప్రాకృతంతో నిమిత్తం లేకుండా ఆద్యప్రకృతియైన సంస్కృతం నుంచే తత్సమ తద్భవాలన్నింటినీ నిష్పన్నం చేయడం మొదటి మతం. అంటే, వీరి చూపులో తచ్ఛబ్దం నిర్దిష్టంగా సంస్కృతానికే పరిమితం. ఆంధ్రభాషాభూషణ కర్త మూలఘటిక కేతన్న, వాక్యాలంకారచూడామణికర్త విన్నకోట పెద్దన్న, ఛందోదర్పణకారుడు అనంతుడు మున్నగువారు ఈ మతానికి చేరినవారు. ఆద్య ప్రకృతితోపాటు అవశ్యక స్థలాలలో ప్రాకృతాన్ని కూడ సమీప ప్రకృతిగా పరిగణించి ఈ ఉభయ ప్రకృతులనుండి తత్సమ తద్భవాలను వ్యావర్తకంగా వ్యావర్ణించడం రెండో మతం. ఈ మతం మేరకు తచ్ఛబ్దం సంస్కృత ప్రాకృతాలు రెండింటికీ విస్తృతం. చింతామణి కర్త, అప్పకవి, చిన్నయసూరి మొదలైనవారు రెండోమతానికి చెందినవారు. ఆధునిక భాషా విజ్ఞాన దృష్టిలో రెండో మతంవారి పద్ధతియే పద్ధతిగా ఉందని నిష్కర్షించవచ్చు. అయితే ఈ రెండో మతంవారి ప్రాకృత భాషాప్రసంగం అచ్చంగా సంజ్ఞా పరిచ్ఛేదానికి మాత్రమే సీమితం. బాలవ్యాకరణ తత్సమ పరిచ్ఛేదంలో సంస్కృత సమాల రూపనిష్పాదనమే కనిపిస్తుందిగాని ప్రాకృత సమాల సిద్ధి నామమాత్రానికైనా కానరాదు. దీనినిబట్టి ప్రకృతిద్వయ పక్షంవారైన మన లాక్షణికుల ప్రాకృతభాషా ప్రసక్తి వట్టి మొగం తుడుపనీ, మొక్కుబడివతు అనీ చెప్పడంలో తప్పులేదు.

ప్రజల వాడుకలోని ప్రాకృతాదిభాషలకు పట్టం కట్టబెట్టాలని పట్టుపట్టిన గౌతమ బుద్ధుని స్మారక చిహ్నాలు నూరారు వెలసిన ఈ పవిత్రసీమలో, రసిక హృదయవర్తి 'సత్త సఈ' సంకలనకర్త హాలశాతవాహన చక్రవర్తి పుట్టిపోయిన ఈ పుణ్య భూమిలో, భారతదేశంలోని అన్ని రాష్ట్రాలకంటె అధికసంఖ్యంలో ప్రాకృత భాషామయశాసనాలు లభించిన తెలుగుగడ్డలో ప్రాకృతభాషా ప్రభావం ఇట్టింకులింకి పోవడం ఆశ్చర్యం. జైన బౌద్ధ ధర్మవాహకాలుగా, ఉత్తమసాహితీ నిక్షేపాలుగా ప్రాకృతాదులు నిస్తుల ప్రచార ప్రశస్తులనందినవి కాని, కారణాలు ఏవైనా కానివ్వండి, తెలుగునాట ప్రాకృతాల ఊసు కలలోని మాటగా మారిపోయింది. సంస్కృతరూపకాలు చాల పాలు ప్రాకృత భాషామయాలు. కాని అధ్యాపకులు, అధ్యేతలు పఠనపాఠనాలలో ప్రాకృతభాషాభాగాన్ని ఊచముట్టుగా పరిహరించి సంస్కృతచ్ఛాయతో సరిపెట్టుకోవడం జగమెరిగిన సత్యం. విన్నకోట

పెద్దన, కాకునూరి అప్పకవి ప్రభృతి తెలుగు లాక్షణికులు, విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాది ప్రాకృతభాషా శాబ్దికులకు దూర దూరంగా నమస్కారాలుపెట్టి తమదారిని తాము తరలిపోయారు. అంతేకాదు, తవణి, తవర, తాణం, తాయం, తావు, తేవ వంటి ప్రాకృతసమాలను అన్యదేశ్యాలుగా నిరూపించి వాస్తవస్థితిని తారుమారు చేశారు మన ఆధునిక లాక్షణికులు. దక్షిణ భారతదేశంలోని విశ్వవిద్యాలయాలు పెక్కింట ప్రాకృతభాషా పీఠాలు లేకపోవడం మాట అటుంచి - సంస్కృతపీఠాల, తెలుగు మొదలైన దేశభాషా శాఖల, పాఠ్యప్రణాళికలలో ప్రాకృత భాషాధ్యయనం అస్తినాస్తి విచికిత్సా హేతువు. ఇక, తద్భవాల మాటకువస్తే తెలుగన నూటికి తొంభైపాళ్లు ప్రాకృత భవాలూ, తక్కిన పదిపాళ్ళు సంస్కృతభవాలూ ఉన్నట్లు అభిజ్ఞుల అంచనా. కాని, మన విద్యాసంస్థలన్నింటిలోనూ ప్రకృతి వికృతి రూపాలను వివరించే సందర్భాలలో తెలుగు అధ్యాపకులు సమీపమాతృక అయిన ప్రాకృతాన్ని విస్మరించి - ప్రాకృతానికికూడ సంస్కృతమే మాతృక అన్న భావనవల్లనో లేక ప్రక్రియా లాఘవమన్న ఆశవల్లనో - సంస్కృత మూల రూపాలనుమాత్రం ఏకరువు పెట్టడం ఎన్నేళ్ళుగానో మనం చూస్తున్న విషయం. ఈ విషయమిట్లుండగా, తెలుగును చల్లగా ప్రాకృతభేదాలతో చేర్చిన మహానుభావులు ఈనాడే కాదు, ఆనాడూ ఉన్నారు. 'ఆంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమ కాన.....' (9-8), 'తెలుగుం బ్రాకృతభంగిన బలియుటచే....', (పైది. 9-72) అని కావ్యాలంకారచూడామణి; '....ఈ యాంధ్రభాషయుఁ గవిమతంబునందుఁ బ్రాకృతభేదంబె యునఁగనొప్పు' (1-75) అని అప్పకవీయమూ; 'తెలుఁగు ప్రాకృతాభిధానము గాన....' (పు1) అని ఆంధ్రకౌముదీ; నిర్ణయించడం యోజించ దగ్గది. దీనినిబట్టి ప్రాకృతభాషాధ్యయనాన్ని పట్టుబట్టి తెలుగువారు పరిహరించినట్లు ఊహించవీలున్నది.

కాని, ప్రాకృతభాషలవరంగా అంతోయింతో కృషి సల్పిన పండిత పరిశోధకులు తెలుగునేలలో ఉద్దాముగ్గురికి మించి లేరు. వీరిలో చెల్లిపోయిన తరానికి చెందిన పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, పరవస్తు వేంకటభట్టనాథస్వామి, మానవల్లి రామకృష్ణ కవి, మేడేపల్లి వేంకటరమణాచార్యులు, చిలుకూరి నారాయణరావు, రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, దిగుమర్తి సీతారామస్వామి మున్నగువారు పేర్కోదగ్గవారు. పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర ప్రభృతులు నేటికినీ ప్రాకృత భాషా సాహిత్యాలలో ఉడతాభక్తిగా పరిశ్రమిస్తున్న ఒంటరి వీరులు.

ఎవరెంత కాదన్నా తెలుగుపై సంస్కృతంతోపాటు ప్రాకృతంకూడ తన ప్రభావాన్ని విస్తృతంగా నెరపిందని నిర్ధారించడం దాచేస్తే దాగని సత్యం. ఈ సత్యాన్ని ప్రమాణోపపత్తి సంకలితంగా ప్రకృత సిద్ధాంత వ్యాసంలో డాక్టరు రామబ్రహ్మం సుస్థాపితం చేశారు. సంస్కృత ప్రాకృత లక్షణ ప్రపంచాన్ని ఆమూలచూడం ఆలవోడనం చేసి ఆంధ్ర లాక్షణిక హృదయాన్ని అనుశీలించి, పూర్వపరిశోధకుల కృషిని తైపారు వేసి, సారమతితో ఉచితానుచితాలు వివేచించి, నిశ్చయ జ్ఞాననిరూపకమైన రీతిలో తనవైన నిర్ణయాలను వ్యాస కర్త ఆవిష్కరించారు. ప్రత్యర్థుల వాదాలను ప్రత్యాఖ్యానం చేసే పట్ల సైతం మా రామబ్రహ్మం ఎంతో సహనం

సంస్కారం ప్రకటించారు. ప్రాతిభ సంయమం ధృతిమంతులకే అది చెల్లు.

మొదటి అధ్యాయంలో సంస్కృత ప్రాకృత వ్యాకరణాలలోని వర్ణమాలా పరమైన సంప్రదాయాలు, వర్ణ నిర్దేశం, పరిభాషా నిర్వచన నిరూపణలు శాస్త్రీయంగా ప్రదర్శించబడ్డాయి. వక్ర వక్రతమ సంజ్ఞా నిర్దేశ విషయంలో ఈ వ్యాసకర్త చేసిన ఊహలు కేవలం ఊహాలే కావు పరిశోధకులలో జిజ్ఞాసనూ జిగీషనూ రేకెత్తించే మౌలిక ప్రతిపాదనలు. ఎందువల్లనో దంత్య చ-జల ప్రసంగం ఈ వ్యాసంలో విస్తారంగా సాగలేదు. 'ప్రాకృతే తద్భవే చాపి చజౌ దంతభవౌ స్మృతౌ' అన్న వికృతివివేక కారికనూ, 'సంస్కృత సమంబులందు దంత్యచజలు లేవని తాత్పర్యము' అన్న బాలవ్యాకరణ వృత్తినీ పూర్తిగా విస్మరించినట్లుయింది. ద్వితీయాధ్యాయంలో పరుష సరళాది సంజ్ఞాపరంగా సాగిన చర్చకూడ మేల్తరంగా నిర్వహించబడింది.

పుంలింగ మహద్వాచక ప్రాతిపదికల చివరి అత్వానికి ఉత్వం రావడం గూర్చి చేసిన సుదీర్ఘ ప్రసంగం (పు 119-133) సహేతుకంగా ప్రవర్తిల్లింది ఇక్కడి ఉత్వం ప్రాకృతభాషా ప్రభావ సూచకమని నిర్ధారించడం పూర్వ పరిశీలకు లెవరూ చెప్పని నూతనాంశం. అడిదము సూరకవి కవిసంశయవిచ్ఛేదంలో దృశ్యాదృశ్యంగా దీనికి బీజాలున్నప్పటికీ ప్రాకృతంలోని పుంలింగ మహద్వాచకైక వచన ప్రత్యయమైన 'ఓ' ఇక్కడ ఉత్వంగా మారిందని ప్రస్పష్టంగా ప్రతిపాదించబడింది. తెలుగులో ఇచట ఉత్వం రాకపోవడం దేశీ స్వభావం, ఉత్వం రాకడ ప్రాకృత ప్రభావం.

ఉదా : తెలుగు: వాఁడు; తమిళ: అనన్; కన్నడ: అవం, అవను; తెలుగు: వీఁడు; తమిళ: ఇవన్; కన్నడ: ఇవం, ఇవను; తెలుగు: ఎవఁడు; తమిళ: యావన్, ఎవన్; కన్నడం: యానం, యావను; తెలుగు: మగఁడు; తమిళ: మగన్; కన్నడ: మగను, మగ. ఇట్లే అడియఁడు, అనుమఁడు, ఒడయఁడు, గంగఁడు, గండఁడు, దమ్మఁడు, బసవఁడు, బోయఁడు. రంగఁడు, లింగఁడు, సింగఁడు మున్నగు తత్సమ తద్భవ దేశ్య రూపాలపై ఉత్వం రాలేదు. రెంటికిజెడ్డ 'రేవఁడు' కూడ ఈపట్ల చెడిపోలేదు. చట్టు (ప్రా.ఛట్టో<సం. ఛాత్రః) చందు (ప్రా.చందో>సం.చంద్రః) గుజ్జు (<ప్రా.కుజ్జో>సం.కుబ్జః); బచ్చు (<ప్రా.వేస్సో>సం.వైశ్యః); బట్టు (<ప్రా.భట్టో>సం.భట్టః); రావుతు (<ప్రా.రాఉత్తో> సం.రాజపుత్రః); వెజ్జు (<ప్రా.వెజ్జో>సం.వైద్యః) మున్నగు తద్భవ రూపాలు ఉత్వమాత్రాలుగా వాడుక పడ్డవి 'డు' ప్రత్యయం చేరలేదు గొరవ (సం.గురు-), ప్రోడ (సం; ప్రౌఢ-), మిత్త (సం. మిత్ర) మున్నగు రూపాలలో ఉత్వం కూడా రాలేదు. నాదు, రూపు, వాదు, సద్దు-మున్నగు అమహద్రూపాలపై కూడ ఉత్వం నిలిచి ఉండడం పరిశీలనార్హం.

కుంతి-గొంతి (పు-132) రూప ప్రదర్శన సందర్భంలో ప్రాకృతీయమైన 'కోంతీ'ని కూడ ఉద్ధరించి ఉంటే ఉచితంగా ఉండేది.

'బొంది-బోఁడి' రూపనిష్పాదన సమీక్ష చూడముచ్చటగా సాగింది. 'నింద లేనిదే బొంది పోదు', 'బొందిలో ప్రాణాలుండగా.....' వంటి పలుకుబళ్ళు తెలుగునాట ప్రచురం. 'బోంది' దేహమన్న అర్థంలో పాళీభాషయందలి శుంశుమార జాతక గాథలో

'మహాతేవర తే బోంది న చ పణ్ణా....' (నీ శరీరం గొప్పదే కాని ప్రజ్ఞ కాదు.) అని ప్రయుక్తం. హేమచంద్రుని దేశీనామమాలలో దేశీప్రాకృత రూపంగా ఇదే అర్థంలో 'బోందీ' ఉల్లేఖించబడింది. బొంది శబ్దమే బోఁడిగా పరిణమించిందని రామబ్రహ్మం భావన. శబ్దార్థాలలో కానవస్తున్న సామ్యం ఈ భావనకు మూలం కావచ్చు. కాని దీనికి బాధకాలు ఎన్నో ఎదురుపడుతున్నవి. ఈ చర్చా సందర్భంలో 'దకారం డకారంగా మారడం అచ్చికపదాలలో చాలావాటిలో కనబడుతోంది.' (పు-168) అన్నారు వ్యాసకర్త. అయితే, ఈ ధ్వనుల మార్పు అసలుదారి వేరు. మూర్ధన్యమైన డకారమే దంత్యమైన దకారంగా మారడం తెలుగున నిసర్గ స్థితి; విపర్యయం విపరీతి రీతి. అంటే, డకారం ప్రాచీనం – దకారం అర్వాచీనం.

డక్కు > దక్కు, డయ్యు > దయ్యు, డాఁగు > దాఁగు, డిగు > దిగు, డీలు > దీలు, డుల్లు > దుల్లు, డూయు > దూయు, డెప్పరము > దెప్పరము, డేఁకు > దేఁకు, డొంగ > దొంగ, డోఁకు > దోఁకు వంటి జమిలి పలుకులలో వ్యుత్పత్తిపరంగా ఆలోచించినా, ప్రయోగపరంగా వివేచించినా డకారాదులు ప్రాథమికాలు దకారాదులు పరిణత రూపాలు. ప్రాథమిక రూపాలు గ్రంథస్థం కాలేదుగాని దున్ను, దుప్పి, దువ్వు – మొదలగునవి కూడ మౌలికంగా డకారాదులే. డెబ్బది వంటి వాటికి దకారఘటిత రూపాలు కన్పట్టవు. మూలద్రావిడభాషలోని అజ్మధ్య 'ఱ' కారం తెలుగున డకారంగా మారి, వర్ణ వ్యత్యయంచే పదాదికి చేరి అనంతరదశలో దకారంగా మారినందున పై రూపాలు సిద్ధించినట్లు శాస్త్రవిదుల నిర్ణయం అయితే, ఒక్క 'డీలు' తప్ప పైన పేర్కొన్నవన్నీ శుద్ధ దేశీయాలు సంస్కృతంలోని శిథిల శబ్దం 'డీలు'కు మూలమాతృక. ప్రాకృతంలోని 'ఢిల్ల'–, 'సిఢిల'–, 'సఢిల'– దీనికి సమీపమాతృకలు. కావున బొంది – బోఁడి అన్న ఈచర్చ ఇంకను సుపరీక్షితం కావలసి ఉంది.

క్షోదక్షమంగా సాగిన మా ఈ సహవ్రతుని కృషిని పరీక్షించి వెల ఇంతని నిర్ణయించడం సూరిజనుల వంతు విజయస్వ అని ఆశీర్వచించడం మా వంతు.

'ధ్వని.... ప్రీయతాం పరమేశ్వరః' – ఈ సిద్ధాంత వ్యాసంలోని ఆద్యంతాల కలయికచే ఏర్పడ్డ ఈ పలుకుబడిలో సూచితమైన మహార్థం పరిశోధనా పరమేశ్వరులకు ప్రీతిపాత్రం కాగలదని మా ఆశంస.

విజయదశమి
16–10–1983
నాగార్జున నగర్

మా వెంకట రావు



# అనుబంధం - IV

## దొణప్పగారి లేఖ

నాగార్జున నగర్
522 570
28-6-84

ప్రియమైన శాస్త్రీ: శుభాకాంక్షలు. ఉభయత్రకుశలమ్! నీ ఉత్తరాలూ, నీద్వారా ఇతరుల ద్వారా పంపబడ్డ ఓటర్ల జాబితాలు అందాయి. తూ.గో.జిల్లాలోని కొన్ని గ్రామ దేవతల వివరణ పట్టిక కూడ అందింది. చాల సంతోషం. ధన్యవాదాలు.

ఇప్పటికి అనంతపురం, నల్లగొండ, కృష్ణ, గుంటూరు, ప్రకాశం, విశాఖ, ప.తూ.గో. జిల్లాల ఓటర్ల జాబితాలు సమీక్షించాను. జిల్లా కేంద్రాలలో కాకినాడ మిగిలి ఉంది. పుస్తకం త్వరలో పూర్తి చేయాలని ఆశిస్తున్నాను.

నేను జూలై 7, 8 తేదీలలో స్థలాంతరం వెళ్తున్నాను. తక్కిన తేదీలలో ఎప్పుడైనా రావచ్చు.

సినిమాతారల అసలు పేర్లు, కొత్త పేర్లు కొన్ని సేకరించాను. కాలేజి విద్యార్థులు తమలో తాము, ఉపాధ్యాయులకు పెట్టే అడ్డ పేర్లు (Nick Names) కొన్ని సేకరించాను. ఏనుగు, పర్వతాలు, బందరు లడ్డు, కొంగమెడ, గొడుగు, సుందరి, సమోసా, దేవుడు, ఉత్తానపాదుడు వంటివి.

తాతయ్యా, తాతాలు, తాతబ్బాయి అన్నవి తాత పేరు మనవడికి పెట్టినపుడు పెట్టే ముద్దుపేర్లు. ధవే(భే)జి- మరాఠీ ప్రభావ సూచకం. గోదావరి జిల్లాలో కుసీమితం భానాజి, రామర్సు, భానో - కూడ మరాఠీ ప్రభావద్యోతకాలు. మరాఠాపాలకుల పలుబడిలోని కొన్ని ఉద్యోగాలకు సంబంధించినవి - అలాగే సబ్నవీస్, తొశే ఖానా, అంబర్ ఖానా, పీల్ ఖానా- వంటి ఇళ్ళ పేర్లు మరాఠీ ప్రభావ సూచకాలే!

రాజమండ్రిలో కోర్లమ్మ, సుబ్బాయమ్మ దేవతలున్నారు. ప.గో.లో పెద్దింట్లమ్మ, మావుళ్ళమ్మ ప్రసిద్ధులు. మీ ప్రాంతంలో పేరుగల పేరంటాళ్ళచరితలు (ఉదా: మండపేట, పాపమ్మ, సన్యాసమ్మ) కూడ సేకరించాను.

మీరు 5వ తేదీన వచ్చిచేరితే బాగుటుందని నా అభిప్రాయం.

శుభాకాంక్షలతో,
తూమాటి దొణప్ప
28-6-84



# అనుబంధం - V

## ద్రోణప్పగారి పదవులు

**I. విశ్వవిద్యాలయాల్లో సభ్యత్వం :**

1) ఆంధ్ర, నాగార్జున విశ్వవిద్యాలయాల అకడమిక్ కౌన్సిల్, సిండికేట్ సెనేట్‌లలో హైదరాబాదు విశ్వవిద్యాలయం స్కూల్ అకడమిక్ బోర్డ్‌లో సభ్యులు.

2) ఆంధ్ర, బనారస్, కాకతీయ, మద్రాసు, మైసూర్, నాగార్జున, ఉస్మానియా మొదలైన విశ్వవిద్యాలయాల డిగ్రీ, ఓరియంటల్, పోస్ట్ గ్రాడ్యుయేట్ బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లలో సభ్యులు.

3) నాగార్జున విశ్వవిద్యాలయం ఫాకల్టీ ఆఫ్ హ్యూమానిటీస్‌కు డీన్‌గా వ్యవహరించారు.

4) ఆంధ్ర, బనారస్, బెంగుళూర్, బరంపురం, బొంబాయి, కాకతీయ, కేరళ, మద్రాసు, మదురై, మైసూరు, నాగార్జున, నాగపూర్, ఉస్మానియా, రాయపూర్, సంబల్‌పూర్, ఉత్కళ, శ్రీకృష్ణ దేవరాయ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో, న్యూఢిల్లీవారి సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్, పుట్టపర్తిలోని సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్‌లలో డిప్లొమా, ఎస్.ఎస్.సి., ఓరియంటల్, మెట్రిక్, డిగ్రీ, స్నాతకోత్తర పరీక్షలకు పేపర్ సెట్టర్‌గా, మోడరేటర్‌గా, వాల్యుయర్‌గా, ఛైర్మన్‌గా వ్యవహరించారు.

5) ఆంధ్ర, బెంగుళూర్, బనారస్, గోరఖ్‌పూర్, కాకతీయ, కేరళ, మద్రాసు, మదురై, మైసూర్, నాగార్జున, ఉస్మానియా, శ్రీకృష్ణదేవరాయ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో యూనివర్సిటీ సెలక్షన్ కమిటీలలో, ఇన్‌స్పెక్షన్ కమీషన్‌లలో సభ్యులు.

**II. విద్యాసంస్థలు, సంఘాలలో సభ్యత్వం :**

1) 1974-77లో హైదరాబాదులోని తెలుగు అకాడమీలో పాలకమండలి సభ్యులు.

2) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడమీ కార్యనిర్వాహక వర్గ సభ్యులు.

3) 1970 నుంచి పూనాలోని లింగ్విస్టిక్ సొసైటీ ఆఫ్ ఇండియాలో, 1972 నుంచి త్రివేంద్రం లోని ద్రవిడియన్ లింగ్విస్టిక్ అసోసియేషన్‌లో జీవిత సభ్యులు.

4) న్యూఢిల్లీలోని యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ వారి మాడరన్ లాంగ్వేజ్ పానెల్ కమిటీ, సెలక్షన్ కమిటీలలో సభ్యులు.

5) న్యూఢిల్లీలోని నేషనల్ అకాడమీ ఆఫ్ లెటర్స్ (సెంట్రల్ సాహిత్య అకాడమీ) వారి జనరల్ కౌన్సిల్, అడ్వయిజరీ కమిటీలలో సభ్యులు.

6) 1984 నుంచి ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్‌కు ఛైర్మన్.

7) ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అసోసియేషన్ వారి 15వ మహాసభకు అధ్యక్షులుగా వ్యవహరించారు.

8) ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ బోర్డ్‌లో సభ్యులు.

## III. నిపుణుల సంఘంలో సభ్యత్వం :

1) తెలుగు అకాడమీ వ్యవస్థాపన సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటు చేసిన జె.పి.ఎల్. గ్విన్ కమిటీలో సభ్యులు.

2) ఆంధ్రప్రదేశ్ సంగీత, నాటక అకాడమి సమాచార, పౌర సంబంధ శాఖవారి తెలుగు జానపద విజ్ఞానం సలహా సంఘంలో సభ్యులు.

3) 1961లో న్యూఢిల్లీలోని భారత ప్రభుత్వం వారి జనాభా లెక్కల సేకరణ సంఘంలో సభ్యులు.

4) ఆకాశవాణి కడప, విజయవాడ, విశాఖ పట్టణం కేంద్రాలలోని సెలక్షన్ కమిటీలలో సభ్యులు.

5) విద్యాశాఖామాత్యుల నేతృత్వంలోని ఆంధ్రప్రదేశ్ తెలుగు పాఠ్యనిర్ణాయక సంఘంలో సభ్యులు.

6) తెలుగు విశ్వవిద్యాలయం స్థాపన సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటు చేసిన సంఘానికి ప్రత్యేకాధికారి, ఛీఫ్ కో – ఆర్డినేటర్.

## IV. పాల్గొని, పరిశోధనా పత్రాలు సమర్పించిన సాహితీ, భాషా సదస్సులు, చర్చా గోష్ఠులు, మహాసభలు మొదలైనవి –

1) అంతర్జాతీయ మహాసభలు : (i) 1975 ఏప్రిల్‌లో హైదరాబాదులో జరిగిన తెలుగు మహాసభలు.

(ii) 1977 నవంబరులో త్రివేంద్రంలో జరిగిన మలయాళం మహాసభలు.

(i) 1981 ఏప్రిల్‌లో కౌలాలంపూర్‌లో జరిగిన తెలుగు మహాసభలు.

2) భారతదేశంలోని వివిధ కేంద్రాలలో జానపద విజ్ఞానం, అనువాదం, అలంకారశాస్త్రం, విషయ సామగ్రి – అమర్చే పద్ధతి పునర్ వ్యవస్థీకరణ, స్నాతకోత్తర స్థాయిలోని నిఘంటు నిర్మాణంలో పరిశోధనా సమస్యలు మొదలైన వాటిపై జరిగిన జాతీయ మహా సభలు, సదస్సులు.

3) 1954 డిసెంబర్, 1970 డిసెంబర్‌లో పూనాలో, 1973 అక్టోబర్‌లో ఆగ్రాలో జరిగిన లింగ్విస్టిక్ సొసైటీ ఆఫ్ ఇండియా మహాసభలు.

4) 1972 జూన్‌లో తిరుపతి, 1976 జూన్‌లో వాల్తేరు, 1977 జూన్‌లో బెంగుళూర్, 1978 జూన్‌లో మదురై, 1981 జూన్‌లో హైదరాబాదు, 1987 జనవరిలో అనంతపురంలో జరిగిన ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అసోసియేషన్ మహాసభలు.

5) అనంతపురం, గుంటూరు, హైదరాబాదు, తిరుపతి, వాల్తేరు, వరంగల్లులో జరిగిన తెలుగు లిపి సంస్కరణం, గ్రాంథిక వ్యావహారిక తెలుగు, ప్రాచ్య అధ్యయనం రాష్ట్రస్థాయి మహాసభలు.

**V. ప్రసంగించిన విస్తరణ/ధర్మనిధి ఉపన్యాసాలు.**

1) i. 1976లో హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఏర్పాటు చేసిన తెలుగు వైతాళికులు పరంపరలో మునగాల రాజాగారి గురించి.

ii. 1978లో గుడివాడలో పై పరంపరలోనే జయపూర్ మహారాజాగారి గురించి.

iii. 1982లో హైదరాబాదులో పై పరంపరలోనే పిఠాపురం మహారాజాగారి గురించి.

2) 1979లో నెల్లూరులో తిక్కవరపు రామిరెడ్డి ధర్మనిధి సంఘం వారు ఏర్పాటు చేసిన సభలో "తిక్కన భాష" గురించి.

3) 1981 మేలో తిరుపతిలో తిరుపతి దేవస్థానంవారు ఏర్పాటు చేసిన సభలో "అన్నమాచార్యుని పదజాలం" గురించి.

4) 1981 జూన్ హైదరాబాదులో ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అసోసియేషన్‌వారు ఏర్పాటు చేసిన సభలో తెలుగులో "ప్రాకృత వ్యాకరణ సంప్రదాయాలు" గురించి.

5) 1981 డిసెంబర్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ నిర్వహించిన 'ఆంధ్ర మహా భారతం'పై విస్తరణోపన్యాసం.

6) i. 1982లో వరంగల్లులో జరిగిన పోతన పంచశత జయంత్యుత్సవాల సందర్భంగా "తరువాతి కవులపై పోతన ప్రభావం" గురించి.

ii. 1982లో అనంతపురంలో జరిగిన సభలో "తెలుగు సంస్కృతిపై పోతన ప్రభావం" గురించి.

iii. 1987 జనవరిలో అనంతపురంలో జరిగిన ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ 15వ మహాసభలో అధ్యక్షోపన్యాసం.

**VI. ఇతర అంశాలు:**

1) 1983-85లో నాగార్జున విశ్వవిద్యాలయం ఆటలు క్రీడల సంఘానికి ఛైర్మన్.

2) 1983 - 85లో నాగార్జున విశ్వవిద్యాలయం సాంఘిక సేవా దళానికి ఛైర్మన్.

3) 1983-85లో నాగార్జున విశ్వవిద్యాలయం హాస్టళ్ళకు చీఫ్ వార్డెన్,

4) 1983-85లో నాగార్జున విశ్వవిద్యాలయం ఎన్.ఎస్.ఎస్‌కు ముఖ్య సలహాదారుడు.

5) 1983-85లో వయోజన విద్యా సంఘానికి అధ్యక్షులు.

## VII. వీరి గౌరవార్థం ఏర్పాటు చేసిన బంగారు పతకాలు:

1) తెలుగులో పిహెచ్.డి. పట్టం కోసం సమర్పించిన సిద్ధాంత గ్రంథాలలో పరీక్షకుల నివేదిక మేరకు ఉత్తమమైన దానికి 'నాగార్జున విశ్వవిద్యాలయం ప్రథమ ఆంధ్ర ఆచార్యులు ఆచార్య తూమాటి దొణప్ప బంగారు పతకం'.

2) తెలుగులో ఎం.ఫిల్. పట్టాకోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసాలలో పరీక్షకుల నివేదిక మేరకు ఉత్తమమైన దానికి 'ఆచార్య తూమాటి దొణప్ప పరిశోధన బంగారు పతకం'.

3) గుంటూరు జిల్లా పెదనందిపాడులోని పెదనందిపాడు ఆర్ట్సు అండ్ సైన్స్ కాలేజీలో డిగ్రీ స్థాయిలో తెలుగులో ఉత్తమ విద్యార్థికి ఆచార్య తూమాటి దొణప్ప బంగారు పతకం.

4) కృష్ణజిల్లా విజయవాడలోని మహిళల మాంటిసోరీ కళాశాలలో స్నాతకోత్తర స్థాయిలో మాస్ కమ్యూనికేషన్‌లో ఉత్తమ విద్యార్థినికి 'ఆచార్య తూమాటి దొణప్ప బంగారు పతకం.'



# అనుబంధం - VI

## దొణప్పగారి పర్యవేక్షణలో పరిశోధన చేసిన కొందరు - వారి పరిశోధనాంశాలు

| | | |
|---|---|---|
| వి. కోటేశ్వరమ్మ | - | వీరేశలింగం సాహిత్యం, సంఘ సంస్కరణ |
| నేతి అనంతరామశాస్త్రి | - | శ్రీనాథుని భాష వర్ణనాత్మక విశ్లేషణము |
| గుజ్జర్లమూడికృపాచారి | - | తెలుగు సాహిత్యానికి క్రైస్తవులసేవ |
| Y. అదెప్ప | - | పోతనభాగవతము, భాషాతత్వ సమాలోచనము |
| నాగళ్ళ గురు ప్రసాదరావు | - | తుమ్మల సీతారామమూర్తి సర్వ కావ్య సవిమర్శక సమీక్ష. |
| వెల్చేరు నారాయణరావు | - | తెలుగులో కవితా విప్లవాల స్వరూపం |
| షేక్ మస్తాన్ | - | తెలుగు సాహిత్యం, ముస్లింల సేవ |
| బేతవోలు రామబ్రహ్మం | - | తెలుగు వ్యాకరణాలపై సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం |
| కడియాల రామమోహనరావు | - | ఆంధ్రసాహిత్యంలో కృషీవల జీవనం |
| వి. లక్ష్మణ రెడ్డి | - | తెలుగు జర్నలిజం, అవతరణ వికాసాలు |
| బిట్టు వెంకటేశ్వర్లు | - | పల్నాటిసీమలో కోలాటం |
| తేళ్ళ సత్యవతి | - | తెలుగువారి ఇంటి పేర్లు |
| వడ్లా సుబ్రహ్మణ్యం | - | తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు |
| జి.వి.యస్.ఆర్. కృష్ణమూర్తి | - | A Study on Loan Words in Telugu from Cognate Languages |
| సి.హెచ్. సుశీలమ్మ | - | కిన్నెరసాని పాటలు, సమీక్ష |
| మిక్కిలినేని సుశీల | - | మార్క్సిస్టు దృక్పథంలో మహా ప్రస్థానం |
| యార్లగడ్డ బాలగంగాధరరావు | - | అనంతపురం జిల్లా గ్రామనామాలు ఒక పరిశీలన |
| ద్వా.నా.శాస్త్రి | - | మారేపల్లి రామచంద్రశాస్త్రి కవితా సమీక్ష. |
| ఆకురాతి పున్నారావు | - | సంస్కృతంలోని ప్రసిద్ధాంధ్రవ్యాకరణాలు |
| బొంతగర్ల ప్రసాద్ | - | తెలుగులో దిగంబర కవిత |
| అగ్నిహోత్రం యోగానంద నరసింహాచార్యులు | - | విశ్వనాథ వారి ఛందఃప్రస్థానము |
| కలిదిండి వెంటకరామరాజు | - | విజయ విలాసానుశీలనము |
| గవిని వెంకటస్వామి | - | తెలుగునవలలో నవ్యమానవవాదం |
| అడుసుమిల్లి శ్రీనివాసరావు | - | పశ్చిమ గోదావరిజిల్లా ఊళ్ళపేర్లు |



# ద్వా.నా.శాస్త్రి గురించి....

పూర్తిపేరు : ద్వాదశి నాగేశ్వర శాస్త్రి
పుట్టిన తేది : 15-06-1948
పుట్టిన ఊరు : లింగాల, కృష్ణాజిల్లా
అమ్మ,. నాన్నలు : లక్ష్మీ ప్రసన్న, కృష్ణమూర్తి
చదువు : బి. ఎస్‌సి - శ్రీ సి.ఆర్.రెడ్డి కళాశాల, ఏలూరు
ఎం.ఏ - ఆంధ్ర విశ్వవిద్యాలయం - ప్రథమశ్రేణి
ఎం.ఫిల్ - నాగార్జున విశ్వవిద్యాలయం - 'ఏ' గ్రేడ్
పి. హెచ్‌డి - తెలుగు విశ్వవిద్యాలయం - స్వర్ణపతకం
పి.జి. డిప్లమా ఇన్ లింగ్విస్టిక్స్ - ఉస్మానియా విశ్వవిద్యాలయం - ద్వితీయ శ్రేణి
గురువులు : శ్రీ బండ్లమూడి సత్యనారాయణ, ఆచార్య తూమాటి దొణప్ప, ఆచార్య చేకూరి రామారావు, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు.
ఉద్యోగం : 1972 నుంచి శ్రీ కోనసీమా భానోజీ రామర్సు కళాశాల, అమలాపురంలో 2004 వరకు తెలుగు శాఖలో రీడర్. స్వచ్ఛంద పదవీవిరమణ.
రచనారంభం : 1971
రచనలు :

1. సమాధిలో స్వగతాలు (వచనకవితా సంపుటి) - 1981 (మార్గశీర్షతో కలిసి)
2. వాఙ్మయలహరి (వ్యాససంపుటి) - 1982
3. సాహిత్య సౌహిత్యం (వ్యాససంపుటి) - 1985
4. మారేపల్లి రామచంద్రశాస్త్రి కవితా సమీక్ష - ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసం - 1985
5. ద్రావిడ సాహిత్య సేతువు - ఆచార్య చల్లా - 1989 (పునర్ముద్రణ 2000)
6. వ్యాస ద్వాదశి (వ్యాససంపుటి) - 1991
7. అక్షరచిత్రాలు (అరుదైన ఛాయాచిత్రాలకూర్పు) - 1993
8. సాహిత్య సంస్థలు (పి. హెచ్‌డి సిద్ధాంతవ్యాసం) - 1995
9. ఆంధ్రసాహిత్యం (మూడువేల బిట్లు) - 1997
10. మన తెలుగు తెలుసుకుందాం - 1997 (పునర్ముద్రణ 2000)
11. శతజయంతి సాహితీ మూర్తులు (సంపాదకత్వం) - 1991
12. వ్యాసలహరి (విద్యార్థులకు) - 1997
13. ద్వానా కవితలు (వచన కవితా సంపుటి) - 1998

14. తెలుగు సాహిత్య చరిత్ర (800 పుటలు – నన్నయ నుంచి నేటివరకు) – 1998 (పునర్ముద్రణలు 2001, 2004)
15. మంచి పద్యాలు (కూర్పు, వ్యాఖ్యానం) – 1998
16. విమర్శప్రస్థానం (వ్యాససంపుటి) – 2000
17. వచన కవితా వికాసంలో "ఫ్రీవర్స్ ఫ్రంట్" – 2000
18. కవిగారి జీవితం – రచనలు : 2001
19. గోపి కవితానుశీలనం (విమర్శ గ్రంథం) – 2001
20. సాహిత్య నానీలు (కవితాసంపుటి) – 2001
21. సాహిత్య కబుర్లు (2002)
22. "బుష్కాకి" – దీర్ఘకవిత (2003)
23. తొలిదళితకవి కుసుమధర్మన్నకవి (పరిశోధనాపత్రం)
24. నానీలలో సినారె (కవితాసంపుటి)
25. మనసుగతి ఇంతే (కథా సంపుటి)
26. మాటలంటే మాటలా
27. పురిపండా జీవితం – రచనలు (బండి సత్య నారాయణతో కలిసి)
28. 'గురుశిరోమణి' ఆచార్య తూమాటి దొణప్ప.
29. ద్వానాంతరంగం (విమర్శ వ్యాసాలసంపుటి) (త్వరలో)
30. సమీక్షలు (త్వరలో)

ఇతర రచనలు :

1. కేంద్రసాహిత్య అకాడమీ వారి "ఎన్సైక్లోపీడియా ఆఫ్ ఇండియన్ లిటరేచర్"లో తెలుగు సాహిత్యంపై పదిహేడు వ్యాసాల రచన.
2. తెలుగు అకాడమీ, హైదరాబాదు వారి "తెలుగు సాహిత్యం ప్రశ్నల నిధి"కి వెయ్యి ప్రశ్నలు.
3. తెలుగు అకాడమీ వారి "తెలుగులో కవిత్వోద్యమాలు" పుస్తకంలో మూడు ఉద్యమాలపై వ్యాసాలు.
4. ప్రపంచ తెలుగు మహా సభల ప్రత్యేక సంచికకు విమర్శవ్యాసాలు.
5. పోటీ పరీక్షలపై వివిధ పత్రికలలో వ్యాసాలు.
6. "ఫ్రీవర్స్ఫ్రంట్" పై పరిశోధనపత్రం.
7. వివిధ పత్రికలలో వెయ్యికిపైగా పుస్తక సమీక్షలు.

పురస్కారాలూ – సత్కారాలు :

1. యు.జి.సి. నేషనల్ విజిటింగ్ ఫెలోషిప్ (1995–97)
2. "ద్వానా కవితలు" – రాష్ట్ర స్థాయిలో స.ర.సం. వారి బహుమతి (1997)
3. ద్రవిడ విశ్వవిద్యాలయంలో స్పీకర్ ప్రతిభాభారతిచే సత్కారం (1999)
4. "విమర్శ ప్రస్థానం" – రాష్ట్రస్థాయిలో "విశ్వ సాహితి" వారి బహుమతి (2000)

5. వివిధ ప్రక్రియలలో చేస్తున్న కృషికి తెలుగు విశ్వవిద్యాలయం వారి "ఏటుకూరి వెంకట నరసయ్య స్మారక పురస్కారం (2000)
6. ఉత్తమ సాహితీవేత్తగా "తెనుగు భారతీ సాహిత్యపరిషత్" (ఉయ్యూరు) వారి సత్కారం
7. మానవతా స్వచ్ఛంద సేవాసమితి (అమలాపురం) వారిచే "కోనసీమరత్న" బిరుదు ప్రదానం (2000)
8. యునెస్కో క్లబ్ (రేపల్లె) వారిచే ఉత్తమ అధ్యాపక పురస్కారం
9. కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్, హైదరాబాదు వారిచే "కిన్నెర" పురస్కారం (2001)
10. ఒరిస్సా - ఛత్రపురం తెలుగు సమితివారి "ఉగాది - 2001" పురస్కారం
11. ముంబాయి ఆంధ్రమహాసభ వారిచే సత్కారం
12. కవిత్రయ జయంతి సంఘం - నెల్లూరు వారి "కవిత్రయ పురస్కారం" - 2001
13. విశాఖ కల్చరల్ అకాడమీ వారి "ఉగాది - 2002" పురస్కారం
14. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు ట్రస్ట్ వారి "విశ్వదాత" పురస్కారం - 2002
15. ఢిల్లీ ఆంధ్రా అసోసియేషన్ వారి సత్కారం - 2002
16. "విశాల సాహితి" జగిత్యాల వారి సత్కారం (2001)
17. నవ్య సాహితీ సమితి, హైదరాబాదు వారిచే "మునిమాణిక్యం" పురస్కారం - 2002
18. జీవితభీమాసిబ్బంది 'కళాసమితి' (బందరు) వారి ఉగాదిపురస్కారం- 2003
19. ఎక్స్‌రేసంస్థ విజయవాడ వారి ఎక్స్‌రేపురస్కారం - 2003 (తెలుగుసాహిత్య చరిత్రకి)
20. శ్రీరామబాలబక్తపుస్తకభాండాగారం - రాజమహేంద్రవరం వారి పురస్కారం
21. జైమినీ అకాడమీ, పానిపట్టు వారి జాతీయ పుస్కారం - 2004
22. యువకళావాహిని ఉగాది 2005 అవార్డు.
23. వంశీ ఆర్ట్ థియేటర్స్‌వారి తిరుమల రామచంద్ర పురస్కారం.





